Regd No. M. 1118.

10 పేజీలు 2 అణాలు



# ఆంధ్రపత్రిక

Founder: K. NAGESWARA ROW. SUNDAY EDITION.

Vol. 36. ANDHRA PATRIKA, MADRAS. 17th APRIL 1949 No. 16





## చైనాలో తిరిగి యుద్ధ నిర్వహణాధిపత్యానికి చాంగ్ కై షేక్ ప్రయత్నం

### అనుచరులతో ఆలోచన: పీపింగ్ రేడియో ఆరోపణ

### యాంగ్సీ దక్షిణాన ఆఖరు ప్రతిఘటన

నాన్కింగ్, ఏప్రిల్ 16: జరుగుతున్న సంధిసంప్రదింపులను తోసివేసి యాంగ్‌సీనదికి దక్షిణంగా నిలబడి ఆఖరిసారి ప్రతిఘటించటానికి మార్షల్ చాంగ్‌కైషేక్ తన అనుచరులతో ప్రయత్నిస్తున్నాడని పీపింగ్ కమ్యూనిస్టు రేడియో నిన్నరాత్రి ప్రకటించినది. నాన్కింగ్ ప్రభుత్వ ప్రముఖులయిన జనరల్ చాంగ్ చిన్ చంగ్ ప్రభృతులు ఈమధ్య చాంగ్ నివాసస్థలమైన చికౌకు వెళ్లినది ఈ ప్రతిఘటన వ్యూహాలను చర్చించటానికేనని పీపింగ్ రేడియో ఉద్ఘాటించినది.

సంధి సంప్రదింపులు ఒకప్రక్కన జరుగుతుండగా ప్రభుత్వ విమానాలు కమ్యూనిస్టు ఆక్రమిత ప్రాంతమైన ఉత్తర క్యాంగ్సూ పట్టణాలమీద 76 సార్లు ఎగిరినవనీ చాంగ్ కై షేక్ తన ప్రవర్తనకు ఎంత మాత్రమూ పశ్చాత్తాప పడబోడని ఈ అంశం నిరూపిస్తున్నదనీ పీపింగ్ రేడియో ప్రకటించినది. యాంగ్‌ట్సీరంగానికి ప్రయాణమవుతున్న కమ్యూనిస్టు సైన్యాలకు పీపింగ్, టిన్‌ట్సిన్‌లలో అత్యుత్సాహకరమైన వీడ్కోలు ఇవ్వబడినదని నాన్కింగ్ వార్తసంస్థ. విముక్తి చెందిన ప్రజలు యాంగ్‌ట్సీ నిదాటటంలో వాటికిపూర్తిగా తోడ్పడెదమని ప్రతిజ్ఞ చేశారని ఆరేడియో వెల్లడించినది.

యాంగ్‌ట్సీకి ఉత్తరాన ప్రభుత్వ చేతిలో మిగిలియున్న బలిష్ట స్థావరం పైయువాన్ దగ్గర పోరాటం విజృంభించి మిలిటరి న్యూస్ ఏజన్సీ తెలియజేస్తున్నది. షాంఘయ్‌లో విద్యార్థులు కందకాలుతవ్వటం నేర్చుకుంటున్నారు.

చైన్యాడాలర్ నోటు కాగితం ముక్క కన్నా అధమమయి పోవటంవల్ల, చాం

[2 వ పేజీ చూడుడు]

### నిజామాబాదు జిల్లాలో 279 మంది రజాకార్ల విడుదల

హైదరాబాదు, ఏప్రిల్ 15: హైద్రాబాదు పోలీసు చర్య అనంతరం నిజామాబాదు జిల్లాలో అరెస్టు చేయబడిన 887 మంది రజాకార్లలో 279 మంది ఇంతవరకు విడుదల చేయబడిరని నేడు తెలిసినది. నేడు మరొకని విడుదలకు ఉత్తర్వు లివ్వబడెను.

సంస్థాన కాంగ్రెస్ ప్రముఖుల విజ్ఞప్తుల పర్యవసానంగా, ముస్లిములు విరివిగా కాంగ్రెసులో చేరుచున్నట్లు తెలియుచున్నది. ఈవారంలో చాలామంది ముస్లిములు సభ్యులుగా చేరారు. జిల్లాలలో కూడా ఈ కార్యక్రమం సంతృప్తికరంగా సాగుతున్నట్లు వార్తలు వస్తున్నాయి.

### పాకిస్థాన్‌లో కొత్తపార్టీ

లాహోర్, ఏప్రిల్ 16: పశ్చిమ పంజాబులోని వివిధప్రాంతాలకు చెందిన కొందరు ముస్లింలీగుసభ్యులు మియా ఇఫ్తికారుద్దీన్, ? మహమ్మద్ ఇబ్రహీంఖాన్ అధ్యక్షతన సమావేశమై 'ఆల్ పాకిస్థాన్ నేషనల్ లీగ్' అనే కొత్తపార్టీ నొకదానిని స్థాపించారు. ఇందులో కుల మత వివక్షతలేకుండా పాకిస్థాన్ ప్రజలందరికీ ప్రవేశం వుంటుంది. లాహోర్ దినపత్రికలయిన 'ఆజాద్', 'షఫీనా'ల సంపాదకులు, మరి ఇద్దరు సభ్యులు కలిసి పార్టీ నిబంధనలను ప్రణాళికను తయారుచేయుటకు నియమించబడ్డారు. సమావేశంలో పాల్గొన్న మరొక దినపత్రిక 'నూజీ' సంపాదకుడు ముజఫర్ ఖాన్, కొత్తపార్టీ ఆవశ్యకతనుగురించి మాట్లాడుతూ ముస్లింలీగ్ నాయకులు తమ ప్రవర్తనవల్ల ప్రజల విశ్వాసాన్ని కోల్పోయినారనీ, దేశంలో ఏర్పడిన నూతన వ్యవస్థలో వీరి నాయకత్వంవల్ల ప్రయోజనంలేదనీ, ప్రజలలో యథార్థ ప్రజాస్వామ్యాన్ని ప్రచారం చేయవలెనంటే కొత్త సంస్థ లేనిదే లాభంలేదనీ ఉద్ఘాటించెను. (యు. ప్రె)

## కాశ్మీర్‌లో భారతసేనలపై పాకిస్థాన్ సేనల కాల్పులు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 16: కాశ్మీర్‌లో టిత్వాల్ రంగంలోని సేరి అనే గ్రామం దగ్గర గురువారంనాడు పాకిస్థాన్ సేనలు భారతసేనలపై కాల్పులు జరిపినట్లు వార్తలు వచ్చినవి. ఈ కాల్పులు యుద్ధవిరమణ సరిహద్దులకుపైగా జరిగినవి.

రైఫిల్‌లు, చేతిబాంబులు మొత్తం 35 పేల్చబడినవనీ, మరఫిరంగులు కూడ సాగ్లు? కాల్చబడినవనీ తెలుస్తున్నది. భారత సేనలు యుద్ధవిరమణ నియమాలను క్రమం తప్పకుండా అనుసరిస్తూ, తిరిగి కాల్పులు జరపలేదు. పాకిస్థాన్ సేనలు సేరిగ్రామాన్నీ, దాని పక్కనే వున్న కోప్రా అనే గ్రామాన్నీ ఆక్రమించుకున్నవి.

ఈ విషయం ఐక్యరాజ్య సమితి పరిశీలకునికి నివేదించ బడినది.

గవర్నర్ జనరల్ రాజాజీతో బర్మాప్రధాని థాకిన్‌నూ.

## కామన్వెల్తు సమావేశంలో బర్మా విషయమై చర్చ

### ఇండియా పాకిస్థాన్ ప్రధానులు ప్రతిపాదిస్తారని థాకిన్‌నూ ప్రకటన

కలకత్తా, ఏప్రిల్ 16: ఇండియా, పాకిస్థాన్‌ల ప్రధానులు బర్మాసమస్యను లండన్ కామన్వెల్తు ప్రధానుల సమావేశంలో ప్రతిపాదించటానికి అంగీకరించారని బర్మా ప్రధాని థాకిన్‌నూ నేడిచ్చట వెల్లడించెను. లండన్ సమావేశంలో ఇండియాపై చర్చజరుగుతుంది. అప్పుడు బర్మాపైకూడా చర్చ జరుగుతుంది.

థాకిన్‌నూ ఇవాళ పొద్దున విమానంలో రంగూన్‌కు వెళ్లిపోయెను. ఇండియాకు రావటం తనకు చాలా ఇష్టమనీ, అవకాశం దొరికితే తిరిగీ రావాలని కోరుతున్నాననీ ఆయన అన్నాడు.

## కాంగ్రెసు కార్యక్రమంలో కాంగ్రెసు ప్రభుత్వాల ఆలస్యం

### కళా వెంకట్రావు గారి విమర్శ

అకోలా, ఏప్రిల్ 15: కాంగ్రెసు కార్యక్రమమును ఆచరణలో పెట్టుటలో కాంగ్రెసు మంత్రి వర్గములు చేయుచున్న ఆలస్యమును, కాంగ్రెసు సిద్ధాంతములపై కమ్యూనిస్టులు చేయుచునప దుష్ప్రచారమును కాంగ్రెసు సంస్థ ఎదుర్కొనవలసి యున్నదని కాంగ్రెసు ప్రధానకార్యదర్శి కళా వెంకట్రావు గారు నేడు యు. ప్రె. విలేఖరితో గోష్ఠి జరుపుచు ఉద్ఘాటించిరి.

కాంగ్రెసువారిలో బయలుదేరిన అంతర్భేదములను విమర్శించుచు, 'ఒక కమ్యూనిస్టు ఎప్పుడూ మరొక కమ్యూనిస్టుపై దుష్ప్రచారం చెయ్యడు. అటువంటప్పుడు ఈ దురలవాటు కాంగ్రెసు వారిలోనే ఎందుకుండవలెను? కాంగ్రెసు కమిటీలకు, రాష్ట్ర మంత్రివర్గాలకు సఖ్యత లేకపోవుట నిజంగా శోచనీయం' అని కళా వెంకట్రావుగారనిరి.

సి. పి. బీరార్‌లోని 8 మరాఠీ భాషా జిల్లాలనేకంచేసి మహా విదర్భ రాష్ట్రమును నిర్మించు విషయమై చెప్పుచు, "నేను తీవ్ర భాషారాష్ట్రవాదిని. కనుక సహజంగా నేను మహావిదర్భ నిర్మాణమును సమర్థించెదను." అని కళా వారన్నారు.

## బ్రిటిష్ మంత్రులకు కమ్యూనిస్టుప్రత్యర్థులు

### వచ్చే ఎన్నికలకు సన్నాహాలు

లండన్, ఏప్రిల్ 15: వచ్చే ఏడాది బ్రిటన్‌లో జరుగబోవు పెద్ద ఎన్నికలలో బ్రిటిష్ విదేశాంగమంత్రి ఎర్నెస్టు బెవిన్‌కు ప్రత్యర్థిగా, కమ్యూనిస్టుపార్టీ లివర్పూల్ పార్టీ ఉపాధ్యక్షుడు హారీ మెక్‌షేన్ పోటీచేయునని బ్రిటిష్ కమ్యూనిస్టుపార్టీ నేడు ప్రకటించిన 19 అభ్యర్థులజాబితా ప్రకారం తెలియుచున్నది.

మంత్రి హెర్బర్ట్ మారిసన్‌కు కమ్యూనిస్టుపత్రిక "డెయిలీ వర్కర్" సంపాదకుడు ఆర్. కాంప్‌బెల్ ప్రత్యర్థిగా పోటీచేయును.

(గత) కామన్సుసభలో కమ్యూనిస్టు ప్రతినిధులుగానున్న విలియం గల్లాచర్, ఎ. పైరటిన్ తిరిగి తమ స్థానాలకు పోటీచేసెదరు.

## తూర్పు పంజాబు ప్రధాని సచార్‌కు అధిష్ఠానవర్గ మందలింపు

### మంత్రివర్గంలో సమగ్రమైన మార్పులు అవసరమని తాఖీదు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 15: కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు గట్టిగా జోక్యం కల్పించుకొని, తనపట్టు నెగ్గించుకోగలుగుటతో, తూర్పు పంజాబు మంత్రివర్గ నిర్మాణ వ్యవహారం నేడొక ముఖ్య ఘట్టం చేరిందనే చెప్పవచ్చు.

పార్లమెంటరీబోర్డు ఆదేశాలను ధిక్కరించి తన యిష్టంవచ్చినవారితో భీమ్‌సేన సాచార్ మూడురోజుల క్రితం యేర్పాటుచేసిన మంత్రివర్గంలో పెద్దమార్పులు రాగలవని, డిప్యూటీ మంత్రి పదవులు (యిప్పటికీ వీరిలో ఆర్గురు ప్రమాణస్వీకారము చేశారు) పూర్తిగా తొలగింపబడ వచ్చునని తెలుస్తున్నది.

"మంత్రివర్గంలో మొత్తం నల్గురు మంత్రు లుండాలనీ, వీరిలో ఒకరు సాచార్ వర్గానికి యిద్దరు భార్గవవర్గానికి చెందినవారై ఉండాలని, నాల్గవ మంత్రి హరిజన సభ్యులతో అత్యధిక సంఖ్యాకుల తోడ్పాటుగలిగిన, హరిజనుడై యుండాలని కాంగ్రెస్ పార్లమెంటరీబోర్డు మొట్టమొదట ఆదేశించినది. బోర్డు మాటకాదనలేక సరేనని చెప్పి సిమ్లా వెళ్లి తన యిష్టంవచ్చినవారితో మంత్రివర్గాన్ని నిర్మించాడు. ఈ సంగతి తెలియగానే, తక్షణం ఢిల్లీకివచ్చి, తానుచేసిన పనికి సంజాయిషీ చెప్పుకోవలసిందిగా కోరుతూ పార్లమెంటరీబోర్డు భీమ్‌సేన్ సాచార్‌కు యీ దినమే తంతిపంపెను.

"మీరు పదవీప్రమాణం స్వీకరించారని మీతోపాటు చౌదరి లాహిరిసింగ్ మరి ముగ్గురు సభ్యులు, మంత్రిపదవులకు ప్రమాణస్వీకరించారని మాకిప్పుడే తెలియవచ్చింది. సిమ్లాలో మీకు అనుకూలంగా ఓటు చేసినవారేనని, మీకు ఓటు చేయని వారి నెవరిని మంత్రివర్గంలోకి తీసుకొను

[illegible]

(3 వ పేజీ చూడుడు)

### వింధ్యప్రదేశ్ పరిపాలనాస్వీకరణం

#### పటేలుకు అభినందన పరంపర

న్యూఢిల్లీ, ఏప్రిల్ 15: వింధ్యప్రదేశ్ పరిపాలనమును స్వీకరింప నిర్ణయించినందులకు సర్దార్ పటేలును, సంస్థానశాఖను అభినందించుచు తంతివార్తలనేకము నేడు సంస్థానశాఖవారికి చేరినవి. కొంతమంది మంత్రుల విషయమై విచారణ జరుపవలెనని, బహిరంగముగా వారిని కోర్టులో విచారించవలెనని కొన్ని తంతివార్తలుకోరుచున్నవి.

### బెర్లిన్‌లో రష్యనుల ఆకతాయితనం

#### ట్రంకు టెలిఫోను మార్గాల ఆపుదల

బెర్లిన్, ఏప్రిల్ 15: బెర్లిన్ పట్టణమును, బెర్లిన్ చుట్టూరా గల సోవియెట్ ఆక్రమిత జర్మనీతో కలిపే మునిసిపల్ ట్రంకు టెలిఫోను మార్గాలు 88 నేటి మధ్యాహ్నమున కల్లా సోవియెట్ తపాలా అధికారులచే ఖండింపబడెను. ఈ ట్రంకు టెలిఫోను కార్యాలయం అమెరికన్ బెర్లిన్ సేటులో నున్నది.

సోవియెట్ జర్మనీతో ట్రంకుఫోను సంబంధములకు తాము రష్యన్ సేటులో వేరే ఏర్పాటు చేయుచున్నామని ఏప్రిల్ 12న రష్యన్ తపాలా అధికారులు ప్రకటించినప్పటినుండి మొత్తం 89 మార్గాలలో ఒక్కొక్కటే ఖండింపబడుతూ వచ్చినవి. ఇక ఒక్క మార్గం మాత్రమే మిగిలి ఉన్నది. అదికూడ త్వరలో త్రెంచి వేయబడునట.

### మంత్రివర్గ విస్తరణ

#### ప్రధాని కుమారస్వామి రాజాగారి ప్రకటన

మదరాసు, ఏప్రిల్ 16: మద్రాసు మంత్రివర్గ విస్తరణ విషయమై అంత్య నిర్ణయము కాంగ్రెస్ అధ్యక్షులు వచ్చిన తరువాతగాని జరుగదని తెలుస్తున్నది. రాష్ట్రపతి డాక్టరు పట్టాభిసీతారామయ్యగారు ఈ నెల 21 తేదీకి చెన్నపట్నం వచ్చెదరు. కాంగ్రెస్ పార్టీలో శాశ్వతమైన శాంతి, సామరస్యములను సాధించుటకు గాను మరికొందరు మంత్రులను నియమించదలచితిని. అన్నివిషయములను సమగ్రముగ పరిశీలన చేయనిదే తొందరపడి ఏ పనిని చేయదలచలేదు అని ప్రధాని శ్రీ పూసపాటి కుమారస్వామిరాజాగారు నిన్న "అడయార్‌లోని "బ్రాడీస్ కాజిల్" లో (ప్రధాని బస) పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ చెప్పిరి.

మంత్రి వర్గవిస్తరణ సుస్థిరమైన మంత్రిమండలి నిర్మాణమునకు దోహదముగ వుండవలెనని నా ఆశయము. అసెంబ్లీ సమావేశములోగ మంత్రుల సంఖ్యను పెంచవలసిన అవసరము ఏమీలేదు అని కూడా అన్నారు.

ఉపమంత్రులను నియమించవలెనను ఉద్దేశ్యము వున్నది. కేంద్ర ప్రభుత్వము వారు ఉపమంత్రులను నియమించి పని చేయుచున్నారు. వారి అనుభవమును మనము కొంతవరకు అనుకరించవచ్చును. ఈ ఉద్దేశ్యమునకు స్వరూపమింకనూ ఏర్పడలేదు. మంత్రివర్గ విస్తరణ విషయము తేలనిదే ఈ ఉపమంత్రుల నియామకమును గురించి నిర్ణయము జరుగుటకు అవకాశము లేదు.

### శాసనసభల్లోని కర్నాటక సభ్యులంతా రాజీనామా ఇవ్వాలి

హుబ్లీ, ఏప్రిల్ 14: తక్షణమే కర్నాటక రాష్ట్రమును నిర్మింపవలెనని కాంగ్రెసు కార్యవర్గం సిఫార్సు చేయనిపక్షంలో బొంబాయి శాసనసభలలోని కర్నాటక సభ్యులు, రాజ్యాంగపరిషత్తులోని కర్నాటకసభ్యులు రాజీనామా నిచ్చివేయవలెనని నేడు ఎస్. ఎస్. యెలమల్లి అధ్యక్షతన సమావేశమైన కర్నాటక ఛేంబర్ ఆఫ్ కామర్సువారు తీర్మానంచేసిరి.

## 'మరొకయుద్ధమే సంభవిస్తే ఎవరికీ గెలుపువుండదు'

### మాజీ రాయబారి బెడెల్‌స్మిత్ అభిప్రాయం

న్యూయార్కు, ఏప్రిల్ 16: "రష్యాతో పశ్చిమ రాజ్యాలకు యుద్ధం వస్తే అది అతి దీర్ఘకాలం జరుగుతుంది. విశేషమైన నష్టం కలుగుతుంది. కాని అందులో ఎవ్వరికీ గెలుపుఅనేది, ఉండదు" అని ఇదివరకు రష్యాలో అమెరికన్ రాయబారిగా పని చేసిన జనరల్ వాల్టర్ బెడెల్ స్మిత్ నిన్న రాత్రి రేడియోలో మాట్లాడుతూ వెల్లడించెను.

"రష్యన్లకు అటంబాంబు నిర్మాణం తెలుసును కాని ఇంకా పెద్ద యెత్తున తయారు చేసే శక్తి రాలేదని భావిస్తున్నాను. రష్యన్ సైన్యం అత్యుత్తమమైనదనటంలో సందేహం లేదు. అయితే త్వరితంగా ముందుకు తోసుకొని వస్తున్నప్పుడు దానికి సప్లయి సమస్య క్లిష్టంగా ఉంటుంది. మాతృదేశాన్ని రక్షించటంలో రష్యనులు అఖండంగా పోరాడుతారు. కాని ఇతరులపై ఆక్రమణ కొనసాగించటంలో వారికి అంత ఉత్సాహం లేదు." అని అతడు వివరించెను.

స్టాలిన్ ఆరోగ్యాన్ని గురించి మాట్లాడుతూ ఆయన చాలా దృఢంగాను చలాకీగాను ఉన్నాడని చెప్పి అసలు జార్జియా రాష్ట్రీయు (స్టాలిన్ జన్మరాష్ట్రం) వాళ్లు ఎక్కువకాలం బ్రతుకుతారు అని అతడు అన్నాడు.

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14: వైశాఖోత్సవ సందర్భమున నిన్న నిక్కి? యమునా నదిలో నలుగురు స్నానమాచరించుచూ నీటిలో మునిగి చనిపోయిరి.

## రాఘవాచారిగారి స్మారక చిహ్నంగా ప్రత్యేక నాటకశాల

### బళ్లారి పురపాలకసంఘస్థల విరాళం

బళ్ళారి, ఏప్రెల్ 15: స్థానిక మునిసిపల్ హైస్కూలు ఆవరణలో రాఘవ స్మారక సంఘ యాజమాన్యాన నేడు బహిరంగ సభ జరిగెను. రాష్ట్ర రెవిన్యూ, పారిశ్రామిక శాఖల మంత్రి శ్రీ హాలహర్వి సీతారామరెడ్డిగారు అధ్యక్షత వహించిరి. నాట్యకళాప్రపూర్ణుడు బళ్ళారి రాఘవాచార్యులుగారు తన జీవితము నంతయు నాట్యకళకై ధారపోసెననియు, వీరికి తగిన స్మారక చిహ్నమును చెన్నపట్నంలో నెలకొల్పుటకు అచ్చట కొందరు ఉత్సాహం వ్యక్తపరచిరనియు, దీనికి వలయు సహాయ మొనర్చుటకు తాము సంసిద్ధులమనియు అధ్యక్షులనుడివిరి. బళ్ళారి పురపాలక సంఘం వారిచే పార్కు సమీపమున ఉన్న స్థలమును రాఘవస్మారక నాటకశాల నిర్మాణమునకు యిచ్చుటకు కావింపబడిన తీర్మానమును ప్రభుత్వము అంగీకరించుననని కూడ మంత్రిగారు చెప్పిరి.

ఎస్. వెంకటరావుగారు సంఘ నివేదికను చదివి, రాఘవ స్మారకనిధికి 10 వేల రూపాయలు వసూలైనవని తెలిపిరి. రావాడ వెంకట్రామశాస్త్రి, డా॥ గురుమూర్తి, దొడ్డనగౌడుగార్లు రాఘవాచార్యులుగారి నటనాకౌశలాన్ని శ్లాఘించుచు ప్రసంగించిరి. అనంతరం ఏకాంక నాటికల ప్రదర్శనలతో సభ ముగిసెను.

# కాశ్మీర్ యుద్ధవిరమణ ఒడంబడిక: సమితిసంఘ ప్రతిపాదనలు

## భారత విదేశశాఖ కార్యదర్శితో చర్చ

రావల్పిండి, ఏప్రిల్ 15: జమ్మూ-కాశ్మీరు సంస్థానమునందు అవస్థార ఒడంబడికకు సంబంధించి ఐక్యరాజ్యసమితి కాశ్మీరు కమీషను సభ్యులు నేడు ఉభయ అధినివేశ ప్రభుత్వములకు కొన్ని ప్రతిపాదనలను అందచేసినారు.

క్రిందటి బుధ, గురువారములు ఇక్కడ సమావేశమై ఇరుపక్షాల వాదనలనూ పరిశీలించినామని, ఆ తరువాత ఉభయులకు సమ్మతంగా ఉండునట్టి ప్రతిపాదనలు తయారుచేయడానికి ప్రయత్నించినామని కమీషను వారు ప్రకటించారు. గత ఆగస్టు 13 వ తేదీ జరిగిన ఒడంబడికలోని రెండవ భాగాన్ని అనుసరించి సంస్థాన భూభాగం నుండి సేనల ఉపసంహారం విషయమై ఈ ప్రతిపాదనలను ఇప్పుడు వీరు తయారు చేసినారు.

ఈ ప్రతిపాదనలను ఉభయ ప్రభుత్వాలకు పంపుతూ వ్రాసిన లేఖలలో కమీషన్ "ఇదివరలో జరిగిన ఒప్పందములను లోబడి వాటి ధోరణికి అనుగుణంగా ఇరుపక్షాల వాదనలను సమన్వయపరచడానికి జరిగిన ప్రయత్నాన్ని ఈ ప్రతిపాదనలు ప్రతిబింబించును" అని వివరించెను.

ఆ లేఖలలో కమీషన్ ఇంకా ఈ క్రింది విషయాలు తెలియచేసింది. "ఈ ప్రతిపాదనలను అంగీకరించడంవల్ల, ఉభయులు కాశ్మీరుకమీషన్ కూడా అత్యంతం గావాంఛించుచున్న లక్ష్యాన్ని చేరడంలో మరొక అడుగు ముందు వేసినవారగుదురు. ఆ లక్ష్యం ఐచ్ఛిక నిష్పాక్షికజన వాక్య నిర్ధారణ ద్వారా జమ్ము-కాశ్మీరు సంస్థాన సమస్య సత్వర, శాంతియుత పరిష్కారం"

కమీషన్ సభ్యులు ముగ్గురు నిన్న రాత్రి న్యూఢిల్లీ వెళ్లినారు. వీరు తమ క్రొత్త ప్రతిపాదనలను భారత విదేశాంగశాఖ సెక్రటరీ జనరల్ గిరిజాశంకర్ బాజ్పాయ్‌తో చర్చిస్తారు. మరొక సభ్యుడు ఇక్కడే నేడు ఈ ప్రతిపాదనలను పాకిస్థాన్ మంత్రి నవాబ్ ముస్తాక్ గుర్మానీకి అందచేశారు.

### కమీషన్ సభ్యులతో బాజ్పాయిచర్చలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 15: భారతవిదేశాంగ శాఖ ప్రధాన కార్యదర్శి సర్ గిరిజా శంకర్ బాజ్పాయ్, సంస్థాన శాఖ వారి కాశ్మీర్ వ్యవహార కార్యదర్శి విష్ణు సహాయ్ నేడు పాకిస్థాన్ నుండి వచ్చిన సమితి కమీషన్ సభ్యులకు డా॥ అల్ఫ్రెడో లా జానోలోనస్, కార్ల్ లెగుజమార్ తోనూ, వారి మిలిటరీ సలహాదారు లెఫ్టినెంట్ జనరల్ మారిస్ డెలోవ్వయి తోనూ చర్చలు జరిపిరి.

కమీషన్ సభ్యులు తెచ్చిన కాశ్మీర్ అవహార ఒప్పందమును గూర్చి వారు చర్చలు జరిపినట్లు తెలియుచున్నది.

## దక్షిణ ఆఫ్ఘనిస్థాన్‌పై పాకిస్థాన్ విమానాలు

కరాచీ ఏప్రిల్ 15: పాకిస్థాన్ విమానములు ఖోస్తులోని మటూన్‌పై బాంబు ప్రయోగంచేసి విధ్వంస మొనర్చినవని ఆఫ్ఘనిస్థాన్ దక్షిణ రాష్ట్రమునుంచి వచ్చిన వార్తలను ఇక్కడి అధికార వర్గములు ఖండించుచు, పాకిస్థాన్ విమానములేవీ దక్షిణ ఆఫ్ఘనిస్థాన్ పైగాని, అచుట్టు ప్రక్కలగాని ఎగురలేదనీ, ఈవార్తలు నిరాధారమూ, హానికరమూ నని చెప్పిరి.

# భారత బర్మా దేశాల చిరకాల ప్రగాఢ స్నేహం

## చిరస్థాయిగా ఉండాలని బర్మా ప్రధానామాత్యుడు థాకిన్‌నూ ఆశయం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 15: "మా దేశము నాద్వారా భారత ప్రజానీకానికి మనః స్ఫూర్తియైన సద్భావసందేశం పంపింది. మన ఉభయదేశాలకూ చిరకాలంగా ప్రగాఢ స్నేహసంబంధముంది. ఈ సంబంధం మాకు ఎల్లప్పుడూ, ముఖ్యంగా కష్టకాలాలలో ఎంతో ఉపశమన కారకంగా ఉంటూవచ్చింది." అని బర్మా ప్రధానామాత్యుడు థాకిన్‌నూ నేడు రంగూన్ బయలుదేరేముందు భారత ప్రజలకు వీడ్కోలు సందేశమిస్తూ అన్నారు.

థాకిన్‌నూ సందేశం ఇల్లా వుంది: స్వాతంత్ర్య లక్ష్యసాధనలో మన ఉభయ దేశాలూ భుజాలుకలిపి పురోగమించాయి. మన పరస్పర స్నేహం ఇట్లానే చిరస్థాయిగా ఉంటుందని నా విశ్వాసం. బర్మా నేడు చాల చిక్కులలో ఉంది. అయితే, అనతికాలంలోనే మేము శాంతి సౌభాగ్యాలు పొందగలమని నా నమ్మకం. భారతదేశంనుంచి, ఎన్నడూ లోపించకుండా మాకు లభిస్తున్న ఆదరమూ, స్నేహపూర్వక సహాయమూ కలన త్వరలోనే మేము ఈ చిక్కులనుంచి బయటపడగలము.

భారతదేశంకూడా ఒక సమయంలో చిక్కులకు లోనైనప్పటికీ శాంతిని సాధించగలిగినందుకు నేను ఎంతో సంతోషిస్తున్నాను. నాయకోత్తముడయిన మహాత్మాగాంధి ప్రబోధించిన శాంతి, ప్రేమల అమర సందేశ ఫలితంగానే ఇది సాధ్యమయినదనడంలో సందేహం ఏమాత్రం లేదు.

భారతదేశంలో నేను చూసినదానిని బట్టి, ఈ దేశం ప్రతిభాశాలిఅయిన ప్రధానామాత్యునీ, ఆయన అనుయాయులా నాయకత్వాన అప్పుడే పురోగమనం ప్రారంభించినదని నాకు స్పష్టమైనది. త్వరలోనే ఈదేశం ప్రపంచ ప్రధాన రాజ్యాల పంక్తిలో నిలవగలదు. మన స్నేహము చిరస్థాయి అగుగాక.

> **"కావాలనుకున్న వన్నీ లభించినవి" —థాకిన్‌నూ**
>
> కలకత్తా, ఏప్రిల్ 15: "నేను కావాలనుకొన్నవి అన్నీ బాబాగా నాకు లభించినవి." అని బర్మా ప్రధానమంత్రి థాకిన్‌నూ ఢిల్లీనుండి వచ్చినవెంటనే పత్రికా విలేఖరులకు చెప్పారు. అయితే సరిగా చెప్పిన మూడు ముక్కలను విశదీకరించడానికిగాని, అంతకు మైగా ఏమైనా చెప్పడానికిగాని ఆయన సమ్మతించలేదు.

### బర్మాకు తోడ్పడడానికి భారతదేశం సమ్మతి

కలకత్తా, ఏప్రిల్ 16: 'భారతదేశం బర్మాకు తోడ్పడడానికి సమ్మతించింది' అని బర్మా ప్రధానామాత్యుడు థాకిన్‌నూ ఇవ్వాళ ఇక్కడ ప్రసంగిస్తూ అన్నాడు.

'నేను ఢిల్లీవచ్చినపని విజయవంతమయింది. భారతదేశంనుంచి సహాయం కావాలని నేను కోరాను. నేను కోరింది నాకు సిద్ధించింది' అని ఆయన అన్నారు.

అయితే, ఆసహాయం ఏమిటో, ఎట్టిదో విశదపర్చడానికి ఆయన నిరాకరించారు. తాము ఢిల్లీ వచ్చినది భారతదేశంగురించి చర్చించడానికేననీ, కావున బర్మా వ్యవహారాలను గురించి చర్చించే సావకాశం లేకపోయిందనీ, అయితే భారత, పాకిస్థాన్ దేశాల ప్రధానామాత్యులిద్దరూ కూడా లండన్‌లో జరిగే అధినివేశాల ప్రధానామాత్యుల మహాసభలో బర్మా విషయం తీసుకురావడానికి సమ్మతించారనీ థాకిన్‌నూ అన్నారు.

### పునఃప్రయాణం

కలకత్తా, ఏప్రిల్ 15: ఇండియా, పాకిస్థాన్ ప్రధానులతో, సంభాషించుటకు ఢిల్లీ, కరాచీలకు వెళ్లిన బర్మా ప్రధాని థకిన్‌నూ నేడు బర్మాకు తిరిగి వెళ్లుచు కలకత్తాలో దిగెను. రాత్రికి ప్రభుత్వభవనంలో గడిపి రేపు ప్రాతఃకాలమే రంగూన్‌కు విమానంలో బయలుదేరును.

# గాంధేయ సారస్వత 'సంచార ప్రదర్శనం'

రాజకోట, ఏప్రిల్ 15: మహాత్మాగాంధి ఆదర్శ, సిద్ధాంతాలను భారత ప్రజా బాహుళ్యానికి బాగా తెలియచేసే నిమిత్తం గాంధేయ సారస్వత సంచార ప్రదర్శనాలు ఏర్పాటు చేయడానికి నిశ్చయించడమైనదని కాకా కలేల్కర్ నేడిచ్చట తెలియచేశారు.

మహాత్మాగాంధి జన్మదినమైన వచ్చే అక్టోబరు 2-న బ్రాడ్‌గేజి రైలు మార్గంలో ఒకటి, మీటర్‌గేజి రైలుమార్గంలో ఒకటి రెండు రైలుబండ్లు గాంధేయ సారస్వతంతో దేశ పర్యటనకు బయలుదేరుతాయట. రైళ్ళు ఎక్కడఆగితే అక్కడ ఆ ప్రాంతీయ భాషలోగల గాంధీయ సారస్వతమూ, ప్రకటనపత్రాలూ ప్రదర్శిత మవుతాయట. (అ. ప్రె.)

# నాన్కింగ్‌కు 60 మైళ్ల తూర్పుగా కమ్యూనిస్టు సేనల ఎదురుముట్టడి

## యాంగ్సీ ఉత్తరతీరాన ప్రభుత్వసేనల వశమైన కీలకస్థావరం పునరాక్రమణ

నాన్కింగ్, ఏప్రిల్ 15: చింకియాంగ్ నుండి ఈరోజు వచ్చిన వార్తలను బట్టి కమ్యూనిస్టు సేనలు యాంగ్సీనది ఉత్తరతీరాన ఇక్కడికి 60 మైళ్ల దూరంలో తూర్పుగా ఉన్న ఒక కీలక స్థావరాన్ని తిరిగి స్వాధీనం చేసుకున్నట్లు తెలుస్తున్నది.

ప్రభుత్వ సేనలు నిన్నను భారీఎత్తున త్రిముఖ దండయాత్ర జరిపి, నౌకా, వైమానిక కాల్పుల దశాళతో కమ్యూనిస్టుల ముట్టడించి ఈస్థావరాన్ని వశంచేసుకొన్నారు. కమ్యూనిస్టులు తెప్పరిల్లుకొని తిరిగి అదనపుబలాలతో నేడు దాడిచేసి ఈ స్థావరాన్ని పునరాక్రమించుకొనినట్లు తెలుస్తున్నది. ఈప్రాంతంలో ప్రభుత్వసేనలు ఇంకా పోరాటం సాగిస్తున్నట్లు సేటి వార్తలు తెల్పుచున్నవి. కాని తాజావార్తలు సైనిక స్థితి యథాప్రకారంగానే ఉన్నట్లు తెలుపుచున్నవి.

పీపింగ్ సంధి సంప్రతింపుల పర్యవసానంతో నిమిత్తం లేని క్యుమింటాంగ్ పక్షానికి చెందిన 'టోరి' వర్గాలవారు చింకియాంగు రంగంలో పోరాటం ప్రారంభించినట్లు తెలుస్తున్నది. గత మాసం పీపింగులో ప్రభుత్వానికి చెందిన దాదాపు 30,000 సైనికులను పట్టుకున్నట్లు అందులో 85మంది సైనికోద్యోగులు ఉన్నట్లు కమ్యూనిస్టు వార్తాసంస్థ నేడు ప్రకటించింది. వీరందర్నీ వారి వెనుకటి దళాలకు పంపి ప్రజాసైనిక దళాలుగా ఏర్పాటు చేయబడుతున్నట్లు కూడా ఈ రేడియో ప్రకటించింది. దాదాపు 1200 మంది క్యుమింటాంగ్ మాజీ ఉద్యోగులు బహిః ప్రాకారాన్ని దాటి ప్రజాసైనికదళంలో చేరడానికి మంచూరియాకు వచ్చినట్లు తెలుస్తున్నది.

చెంగియాంగ్ సేనల సేనాని లెఫ్టినెంట్ జనరల్ టాల్‌హుంగ్-చాన్‌ను అరెస్టుచేసి షాంగైకు పంపినట్లు చెంకియాంగ్ నుండి వార్తలు వచ్చినవి. ఈ విధంగా దాదాపు 180 మందిని ఈ ప్రాంతంలో ఇంతవరకూ అరెస్టుచేసినట్లు తెలుస్తున్నది. వీరందరూ చైనా కమ్యూనిస్టులతో కలసి పనిచేస్తున్నారని వీరిపై ఆరోపణ చేయబడింది.

లండన్, ఏప్రిల్ 15: బ్రిటిష్ ప్రభుత్వ సమాచారశాఖ కేంద్రకార్యాలయంవారు, విదేశాలలో ప్రచార కలాపాలను ముగించడానికీ, కొన్నిచోట్ల తగ్గించడానికీ నిర్ణయించారు. ఇండియా, పాకిస్థాన్లలో తగ్గించడానికి నిర్ణయించారు.

## చైనా - అమెరికా ఒడంబడికలు

### జాతీయ ప్రభుత్వంపై కమ్యూనిస్టుల ఆరోపణలు

షాంఘై, ఏప్రిల్ 15: కమ్యూనిస్టుల చేత దేశద్రోహ చర్యలక్రింద జమకట్టబడుతూన్న చైనా-అమెరికా ఒడంబడికల జాబితాను, నాన్కింగ్ నుంచి వెలువడే ఒక వాణిజ్య పత్రిక ఈవేళ ప్రకటించింది. ఇవి మొత్తం పదివున్నాయి.

సంధి సంప్రదింపులకు కమ్యూనిస్టులు ప్రతిపాదించిన ప్రాథమిక సూత్రాలు ఎనిమిదింటిలోనూ, ఈ ఒడంబడికలను రద్దు చేయటం కూడా ఒకటి.

ఆ పత్రిక ప్రకటించిన ఒడంబడికల జాబితా:

1. నవంబర్ 1946, వాణిజ్య నౌకా సంధి.
2. 1 వ అక్టోబర్ 1946, సహాయసంధి.
3. 1947 అక్టోబర్ 27, సైనిక ఒడంబడిక (అమెరికా సైన్యాన్ని చైనాలో వుంచటానికి అనుమతిస్తూ చేసుకున్న ఒడంబడిక)
4. 1947 అక్టోబర్ 26 ఒడంబడిక.
5. అక్టోబర్ 1947, వాణిజ్య, సుంక, సరఫరాల సంధి.
6. 1947 నవంబర్ విద్యానిధి ఒడంబడిక.
7. 1947 డిశంబర్, నౌకాసంధి.
8. 1948 అంతర్నౌకాయానసంధి.
9. 1948 విమాన ఒడంబడిక.

(అమెరికా విమానదళ సేనాని జనరల్ క్లెయిర్ చీనాల్టుకు చైనాలో పౌర విమాన సరఫరాలు నడపటానికిఅనుమతినిస్తూ చేసుకున్న సంధి.)

10. అన్యోన్య సహకార సంధి.

### ఇంగ్లండుకు ఎర్నెస్టు బెవిన్ ఆగమనం

సౌతాంప్టన్, ఏప్రిల్ 15: అట్లాంటిక్ ఒడంబడికపై సంతకముచేసిన బ్రిటిష్ విదేశాంగ మంత్రి ఎర్నెస్టు బెవిన్ నేడు ఇచ్చట మారిటానియా నౌక నుండి దిగెను.

మాస్కోలో చైనీస్ రాయబారిగా 6 ఏండ్లు పనిచేసి నాన్కింగ్‌కు వెళ్లిపోవుచున్న డా॥ ఫూపింగ్ చాంగ్‌తో బెవిన్ నౌకలోనే ఒక 20 నిమిషాలసేపు మాట్లాడెను.

అమెరికా, కెనడా, యూరప్‌లమధ్య సంబంధములు పూర్వంకంటె బలపడినవని, యుద్ధానంతరశాంతిని కాపాడుటకు తీసుకోబడిన చర్య లన్నిటికంటె అట్లాంటిక్ ఒడంబడికయే గొప్ప దనీ బెవిన్ నౌక దిగుటకుముందు పత్రికా విలేఖరులతో చెప్పెను.

లండనులోని చైనీస్ రాయబారి డా॥ చెంగ్ టిన్‌సీతో కూడా బెవిన్ కొంతసేపు సంభాషించెను.

### "వందేమాతరమే జాతీయగీతం"

పూనా, ఏప్రిల్ 15: పూనా సంగీత బృందంవారిచే ఏర్పాటుచేయబడిన 5 రోజుల గానసభలో నేడు "వందేమాతరం గీతమే జాతీయగీతంగా పరిగణింపబడవలె" నని తీర్మానింపబడెను.

### నెహ్రూ విందు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 15: ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ నేడు తన మేనకోడలు చంద్రలేఖ పండిట్-అశోక మెహతా వివాహసందర్భంలో తన బసలో విందుచేశారు. దాదాపు వెయిమంది అధికార, అనధికారప్రముఖులుహాజరైనారు.

# అస్వస్థత కారణంగా బల్గేరియా ప్రధాని డిమిట్రాఫ్‌కు 'సెలవు'

## ప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకునికి మాస్కో చికిత్స: బర్తరఫ్ అయిన ఉపప్రధానికి కొత్త పదవి

సోఫియా, ఏప్రిల్ 15: అనారోగ్య కారణంగా, బల్గేరియా ప్రధాని జార్జి డిమిట్రావుకు సెలవ మంజూరు చేయబడినట్లున్నా, ఆయన ప్రస్తుతం, చికిత్స పొందుతూ రష్యాలో వున్నటున్నూ, బల్గేరియా కమ్యూనిస్టుపార్టీ కేంద్రసంఘం ప్రకటించింది. ఈయన 65 సంవత్సరాల వృద్ధుడు; 1946 నవంబర్ 22 తేదీ లగాయతూ ప్రధానిగా అధికారంలో వున్నాడు.

ఇటీవల, రాజకీయంగా అనేక పొరపాట్లు చేశాడనీ, పార్టీ వ్యతిరేక చర్యలనబడిన అనేక ఇతర పొరపాట్లు చేశాడనీ, అభియోగం తేబడి, ఉపప్రధాని పదవి నుంచీ, పార్టీ కేంద్రకమిటీ సభ్యత్వం నుంచీ బర్తరఫ్ చేయబడ్డ, ట్రెయికో కోస్టోవ్‌ను జాతీయ శాసనసభ జాతీయ పుస్తక భాండాగార పాలకుడుగా నియమించినట్లు కూడా కేంద్రకమిటీ మరొక ప్రకటన చేసింది.

డిమిట్రావ్ కు అనారోగ్యంగా వుందని ప్రకటించబడటంచేతా, కోస్టోవ్ బర్తరఫ్ చేయబడి వుండటంచేతా, బల్గేరియా సోషలిస్టు కమ్యూనిస్టుపార్టీ నాయకుడు ఎవరను అనేది ఒక సమస్యగానే పరిణమిస్తోందని, లండన్ రాజకీయ వర్గాలవారు అభిప్రాయ పడుతున్నారు.

ఉన్నవారిలో ప్రధాన రాజకీయ వ్యక్తులు ఇద్దరు కనుపిస్తున్నారు. ఉప ప్రధాని, విదేశాంగ మంత్రిగా పనిచేస్తున్న వాసిల్ కోలరోవ్ ఒకడూ, రెండవవాడు, ఆంతరంగిక శాఖా మంత్రిగావున్న యాంటన్ యుగోవ్. కోలరోవ్ చాలా వృద్ధుడు-71 సంవత్సరాల పైబడ్డవాడు. యుగోవ్ 45 సంవత్సరాల నడివయస్సులో వున్నాడు. ఈయన మాసిడోనియాలో జన్మించాడు.

ఇటీవల కోస్టావు కూ మాస్కోకూ ఏర్పడ్డ విభేదాలను అవకాశంగా తీసుకుని, తనకు పోటీ ప్రత్యర్థిగా పెంపొందుతూన్న ఈ వ్యక్తిని కూలదోసి, తనమార్గం సుగమం చేసుకోటానికిగాను, యుగోవ్ చాలా సమీపంలో విసిరినట్లు లండన్ రాజకీయ వర్గాలవారు భావిస్తున్నారు.

### 'గ్రీసుకు సహాయం ఎక్కువ చేయాలి'

లండన్, ఏప్రిల్ 15: గ్రీసుకుసహాయం ఎక్కువ చేయడం అవసరమనీ లేకపోతే గ్రీసు గెరిల్లాలను ఈసంవత్సరం ఓడించడం దుస్సాధ్యమని బ్రిటన్ అమెరికాకు సూచించింది. ఈ సందర్భమై ఫీల్డ్‌మార్షల్ స్లిమ్ తయారుచేసిన విజ్ఞాపనను బ్రిటిష్ విదేశాంగమంత్రి ఎర్నెస్టు బెవిన్ స్వయంగా అమెరికా విదేశాంగ కార్యదర్శి డీన్ అచిసన్‌కు అందచేశాడట.

# దక్షిణాఫ్రికా రిపబ్లిక్‌గానే ఉండాలని మలాన్ ప్రభృతుల ప్రకటన

కేప్‌టౌన్, ఏప్రిల్ 15: "మనమంతా రిపబ్లిక్‌గా పెంపొందాలని నిర్ణయించుకున్నా, మన అభివృద్ధికి ఎట్టి ఆటంకాలూ వుండవు. అలాటి నిర్ణయం చేసుకోటానికి మనకు హక్కుంది. ఆ హక్కుకు భంగం రానంతకాలం ఇతర కామన్వెల్త్ దేశాలతో కలిసి కట్టుగావుంటానికి మన కేవిధమైన ఆక్షేపణా లేదు" అని దక్షిణాఫ్రికా ప్రధాని డేనియల్ మలాన్ మొన్నటి 8 వ తేదీ రాత్రి సెనేట్‌లో ప్రకటించాడు.

మలాన్ లండన్ వెడుతున్నాడు. వచ్చే వారం, లండన్‌లో జరగబోతున్న కామన్వెల్త్ ప్రధానుల సమావేశంలో పాల్గొనబోతున్నాడు.

న్యూకెసిల్‌లో జరిగిన ఒక సభలో ప్రసంగిస్తూ, దక్షిణాఫ్రికా భూముల మంత్రి స్ట్రీయిడం ఇలా అన్నాడు.

"దక్షిణాఫ్రికా యూనియన్‌లో వున్న యూరపియన్లకు అస్తిత్వం వుండాలంటే సర్వస్వతంత్రులమనే ఆత్మవిశ్వాసం అత్యవసరం. అలాటిది కలగాలంటే దక్షిణాఫ్రికా సర్వస్వతంత్రమైన రిపబ్లిక్‌గా పెంపొందాలి. ఇప్పుడు ప్రభుత్వం జేస్తున్న జాతీయపక్షం, వాస్తవానికిరిపబ్లికన్‌పక్షం దాని ప్రధాన విధానమంతా రిపబ్లికన్ విధానం. బ్రిటిష్ సామ్రాజ్యంలో భాగంగా అలానే వుండిపోతే అమెరికాకు ఇప్పుడున్నంత బలాభివృద్ధులు కలిగేవేనా?" అన్నాడు.

# ప్రత్యేక సందర్భాల్లోనే వీటో ప్రయోగం

## ఐక్యరాజ్యసమితి నిర్ణయం

ఫ్లషింగ్ మెడోస్, ఏప్రిల్ 15: అత్యవసరమైన ప్రత్యేక సందర్భాలలో మాత్రమే అగ్రరాజ్యాలు తమ వీటో అధికారాన్ని వినియోగించవలెనని ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశం నిన్నరాత్రి నిర్ణయించినది. అత్యధిక సంఖ్యాకులయిన సభ్యులు ఈ నిర్ణయమును బలపరచిరి. అట్లాంటిక్ ఒడంబడిక మొదలైన ప్రధానాంశాలన్నిటినీ చర్చించవలసినందున సర్వసభ్య సమావేశం ఈస్టరు పండుగకొరకు సమావేశం వాయిదా వేసినది.

ఈ తీర్మానానికి అనుకూలంగా 43 వోట్లు, ప్రతికూలంగా 6 వోట్లు వచ్చినవి. బర్మా, భారతదేశములు వోటింగ్‌లో పాల్గొనలేదు.

తీర్మానాన్ని ప్రతిపాదించినవారు వీటో అధికారం భద్రతామండలిని నిష్ఫలం చేయడానికి పూర్వమే ఆ అధికారాన్ని రద్దుచేయాలన్నారు. అసలు వీటోయే పనికట్టురాయి అని సోవియట్ వర్గం వాదించింది. రష్యా తీర్మానాన్ని ససేమిరా అంగీకరించదని అన్నందువల్ల ఈ తీర్మానాన్ని సమితి ఆమోదించినా భద్రతామండలిలో ఫలితం ఒకేవిధంగా వుంటుందని తీర్మానాన్ని బలపరచినవారు అభిప్రాయపడినారు.

## సర్దార్ పటేలుకు ఖైదీల అభినందన

లూధియానా, ఏప్రిల్ 15: లూధియానాజిల్లా జైలులోని 400 మంది ఖైదీలు సమావేశమై సర్దార్ పటేలు ఈ మధ్య విమానసంఘటన నుండి తప్పించుకొన్నందు కాయన నభినందించుచు ఒక తీర్మానము చేసిరి. జైలు సూపరింటెండెంటు, డిప్యూటీ సూపరింటెండెంటు కూడ ఈసభలో పాల్గొనిరి. ఈ సందర్భంలో ప్రతి ఖైదీకి 10 రోజులశిక్ష తగ్గింపబడెను.

## రేడియో ప్రోగ్రాములు

(ఏప్రిల్ 17 ఆదివారం)

మదరాసు (41 మీ)

ఉ. 7. తెలువార్తలు. 7-15 ఎస్. బి. వసంతకోకిలం. 7-45 ఫిల్ము రికార్డులు. 8. ఇ. వార్తలు. 8-15 టాకీ రికార్డులు. 8-30. పాపములాక. 9. వాయిద్యం. 9-10 మళయాళం. మ 1 గ— టి. కె. రామస్వామి, 1-30. ఇ. వార్తలు. 1-40. శ్రోతలు కోరినవి. 1-50 తెల్గువార్తలు, 2 వీణ. 2-15 ఆటవిడుపు. 3. రుక్మిణి రాజగోపాలను పాట. 4. టాకీ రికార్డులు, 4-30. ఇ వాయిద్యం. 5-30. ఎ. సూర్యనారాయణ, 6. ఇ. వార్తలు, 6-15. రికార్డులు 6-30. గ్రామస్థుల కార్యక్రమం. 7. తె. వార్తలు. 7-30. మళయాళం. 4-15, కాళిదాసుని పాత్రపోషణ శిల్పము వి. వి. రాజమన్నారుగారి ప్రసంగం. 8. ఎం. కల్పకం. 8-30. వి. కె. వెంకట్రామానుజం ఫిడేలు, 9. ఇ. వార్తలు, 9-15. ఈస్టరు గూర్చి ఆర్చిబిషపు ప్రసంగం. 9-30. ఉస్తాదు ఫయాజ్ ఖాను. 9-40. త్రిచినుండి.

## మదరాసు ధరలు

మదరాసు, ఏప్రిల్ 16:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-8 ఎడ్వర్డు బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు. 74-0-0 పెట్లా బంగారు తులం 113-8-0 మూసబంగారు 112-0-0 సీమవెండి తులం 100-8 (రెడీ) 177-0-0 వెండి తులం 1 కి 1-18-0.

పంచదార

"కాన్పూరు" (2 అందరు) రు 90-2-9 అనకాపల్లి" (2 అందరు) రు. 89-6-9

ఆంధ్రపత్రిక

ఆదివారం ఏప్రిల్ 17, 1949

సారస్వతానుబంధము

# నేటి నాటక రంగ స్థితి

## రచన: కొప్పరపు సుబ్బారావు గారు

ప్రొఫెషనల్ నాటకరంగం యొక్క శకం అఖరుదశలో పడింది. అమెట్యూర్ శకం ప్రారంభమైంది. ప్రజానీకం యొక్క అభిరుచుల్లో దృక్పథంలో ఆశయాల్లో, కలిగిన, కలుగుతున్న, మార్పులే దీనికి కారణం. తెలుగు నాటకరంగాన్ని అభ్యుదయ మార్గంలోకి మళ్లించిన మహనీయులు ఇద్దరేవున్నారు. ఒకరు, కన్యాశుల్క రచయితే గురజాడ అప్పారావుగారు. రెండవవారు మహానటుడు కళాప్రపూర్ణ బళ్ళారి రాఘవుడు.

నిత్యజీవితసమస్యలతో కూడిన ఇతివృత్తంతో, వాడుకభాషతో, జీవించే పాత్రలతో, గురజాడవారు తమ కన్యాశుల్కం ద్వారా మన నాటకరంగంలో, తొలిసారిగా వాస్తవికతను అవతరింపజేశారు. పద్యాలయొక్క పాటలయొక్క చెరలో పడివున్న అభినయానికి తొలిసారిగా రాఘవునివల్ల విమోచన కలిగింది. అభినయంలో కూడా వాస్తవికత అవతరించింది. మొత్తంమీద, వీరిద్దరూ మన నాటకరంగంయొక్క దృక్పథాన్ని కొంగ్రొత్త వెలుగు బాటల్లోకి మళ్లించగలిగారు. వీరిద్దరితో, మననాటకరంగం తన కళాధర్మాన్ని సాంఘిక ధర్మాన్నీ తద్వారా తన చారిత్రక ధర్మాన్నీ నిర్వహించుకోనడం సాగించింది.

అయితే, ఈ నిర్వహణ భారాన్ని మన ప్రొఫెషనల్ నాటకరంగం వహించలేకపోయింది. పద్యాలు పాటలు, హార్మోనియం, తబలా, కిరాయీలు, కంట్రాక్టర్ల వ్యాపారదృష్టి, తారాగణం, ఈ మొదలైన కృత్రిమపునాదులమీద ఏ కళాసౌధం నిలబడగలుగుతుంది?

మన ప్రజానీకంయొక్క సంస్కృతీ అభిరుచులూ, ఆశయాలూ దిగువమెట్టులో వున్నంతకాలమూ, మన ప్రొఫెషనల్ నాటకరంగం బహుజనామోదాన్ని పొందగలిగి విజృంభించింది. ఆరోజులు మారాయి-మారుతున్నాయి. మన సంస్కృతికి అభిరుచులకూ, ఆశయాలకూ, కొంగ్రొత్త విలువలు వచ్చాయి- వస్తున్నాయి. ఈ మార్పులకు అనుగుణంగా తన పోకడను కూడా మార్చుకో గలిగితే, మన ప్రొఫెషనల్ నాటకరంగం ఇంకా కొన్నాళ్ళు మనగలిగి వుండేది. కాని, అదింకా పాత ధక్కలోనే కాలక్షేపం చేస్తూ వుంది. దేశంలోని అన్ని లలితకళలూ అంతోయింతో కొత్త దుస్తులతో ముస్తాబవుతూ వున్నా, మన ప్రొఫెషనల్ నాటకరంగం మటుకు తన మసిపాతల్ని విడవకుండా వుంది. ఫలితం పదభ్రష్టత.

ప్రజానీకంలోని మార్పును అనుసరించుకుని మన ఎమెట్యూర్ నాటకరంగం తలయెత్తింది. ఇది ప్రస్తుతం బాల్యావస్థలో వుంది. బాలుడు కాకుండా ప్రౌఢుడు కావడం జరగదుగదా. ఈనాడు తెలుగు జిల్లాలలో మొత్తంమీద రమారమి రెండు వందల ఎమెట్యూర్ సంఘాలు పనిచేస్తున్నాయి. వీటిని అనుసరించుకుని వున్న నటీనటులు, నాటక రచయితలు, గాయక వాదకులు, రంగశిల్పులు, ప్రమోక్తలు మొదలైన కళాకారుల సంఖ్య, రెండు వేలకు మించివుంది.

ఈ మొత్తం కుటుంబాన్ని ఎదుర్కొంటున్న సమస్యల్లోకల్లా కఠినమైన సమస్య ఒక్కటివుంది. పనిముట్లులేని సమస్య. గాయకుడికి పనిముట్టు సమస్యలేదు. అదృష్టవంతుడు. దేవుడిచ్చిన గాత్రమే అతడిపనిముట్టు. చిత్రకారుడు కూడా అదృష్టవంతుడు. అతడికి కావలసిన రంగులు, కుంచెలు, కాగితం వగైరా మొదలైనవి సులభంగా దొరుకుతాయి. శిల్పికూడా అదృష్టవంతుడు. రాయి, ఉలి, సుత్తె మొదలైనవి సులభంగా దొరుకుతాయి. అందరిలోకీ అదృష్టవంతుడు, కవి. కాగితాలు, కలం, సిరా అన్ని వేళలా అన్ని చోట్లా దొరుకుతాయి. నాటకరంగ కళాకారులు దురదృష్టవులు. వారికి కావలసిన పనిముట్లు చౌకగా వచ్చేవి కావు. అన్ని చోట్లా దొరికేవీ కావు.

నాటకశాలకావాలంటే, వేలకొలది రూప్యాలు. చక్కటి పరికరాలుగల స్టేజీ కావాలంటే, వేలకొద్దీ ఖర్చు. తెరలు సీనరీలు కావాలంటే స్టేజీమీద రూపాయలు పడవేయాలి. ఆఖరుకు తాము ఒకనాటకాన్ని చక్కగా అభ్యాసం చెయ్యాలన్నా ఆ సంఘానికి ఇంతలకొద్దీ ఇబ్బంది.

దారిద్ర్యం వున్నచోట పెట్టుబడిదారుల ప్రాబల్యం వుంటుంది. నాటకశాలలు సర్వసాధారణంగా నగరాలు. కాబట్టి కొందరు పెట్టుబడిదార్లు నాటక కళానిర్మాతలుగా అవతరించడం జరిగింది. పెట్టుబడిదార్లకు కావలసింది, లాభాలు. ఎక్కువ లాభాలకోసం [illegible] పొందే ఉపాయాల్ని వెదుకుతూ వుంటారు. కాబట్టి వారు నిర్మించే నాటకశాలల్లో వారి సంకుచిత దృక్పథం ప్రతిబింబిస్తూ వుంటుంది. సీటీలు [illegible] సందులు, సీనరీలు శూన్యం, లైటింగు పరికరాలు శూన్యం. ఆఖరుకు గ్రీను రూములు కూడా సుహృత్తుగా తయారై వుంటాయి. ఇక ప్రేక్షాగారంలో వుండే కుర్చీలు బల్లలు మొదలైనవి కూర్చోడానికి సుఖంగానూ ఉండవు, చూడటానికి ఇంపుగానూ ఉండవు. వీటికి తోడు నల్లులు, దోమలు, దీపపు పురుగులు. మరికి, దుర్గంధం. ఇక మొత్తం నాటకశాలయొక్క నిర్మాణంలో కళా రుచిరమైన శిల్పవైఖరిగాని వాస్తువైఖరిగాని చిత్రవైఖరిగాని మచ్చుకైనా కన్పించవు. అన్నిటికంటె విపరీతం- వీటి అద్దె రెండు వందలు మొదల్కొని నాలుగువందల యాభైదాకా వుంటుంది.

నాటకాలను కళారుచిరంగా ప్రదర్శించాలని ఉవ్విళ్ళూరు మన ఎమెట్యూర్ నాటక సంఘాలకు ఈ వికారపు స్టేజీలు ఎలా ఉపకరిస్తాయి? ఈ అద్దెల్ని ఎలా భరిస్తాయి? మన పెట్టుబడిదార్లు తమ అద్దెల్ని తగ్గించడంగాని, ఆ స్టేజీలను పెంచడంగాని, వాటిని పరికర సంపన్నంగా నిర్మించడంగాని, చెయ్యరు. మనకా, అవి పనికిరావు. పనికొచ్చేవి రెండు మూడు వున్నా, ఆ అద్దెల్ని భరించలేం. పోనీ ఏ పెట్టుబడిదారో మనకోసం కొత్తగా ఊరూరా చక్కని నాటకశాలలు నిర్మించరాదా? నిర్మించరు. నాటకశాలమీద రాబడి తక్కువ – సినీమాలమీద రాబడి హెచ్చు. కాబట్టి ప్రతి పెట్టుబడిదారూ సినీమా హాలును నిర్మిస్తాడేగాని, నాటక హాలును నిర్మించడు.

పోనీ – మన ప్రభుత్వమైనా నిర్మించి యిస్తుందేమో? ఈమధ్య మన మద్రాసు ప్రభుత్వం ఒక కమిటీని వెయ్యడం జరిగింది. దానిమీద మనలో కొన్ని ఆశలు రేకెత్తి ప్రభుత్వం ఊరూరా నాటకశాలలు నిర్మించబోతుందని అనుకోవడం జరిగింది. కాని, కొంచెం ఆలోచించి చూడండి! తినటానికి తిండిలేక, కట్టడానికి గుడ్డలేక, ఉండటానికి ఆచ్ఛాదనలేక లక్షలాదిజనం, బ్రతుకే ఒక నరకంగా అల్లాడిపోతూ వుంటే, కోట్లు ఖర్చుపెట్టి నేటి మన ప్రభుత్వం ఊరూరా నాటకశాలలు నిర్మించి యిస్తుందా? ఇస్తానని చెబితే మటుకు మనం నమ్మదగిన విషయమా? ప్రభుత్వం ద్వారాగాని పెట్టుబడిదార్ల ద్వారాగాని విమోచన కలగబోతుందని ఏ అమెట్యూరైనా అనుకుంటే, అతడు పగటి కలలుకంటున్నాడనుట విస్పష్టం.

మరి, విమోచనసాధనంలేదా? వుంటే ఎక్కడవుంది? ఎలాంటిది?

మొట్టమొదటి సంగతి, మన అమెట్యూర్ల దృక్పథం పూర్తిగా మారాలి. మొట్టమొదటిమార్పు ఏమిటంటే, వందల కొద్ది అద్దెలుపోసి ఆ సినీమా హాల్సులో నాటకం ఆడాలనే వ్యామోహాన్ని మనం విడవాలి. ఆ సినీమా హాల్సులో ప్రదర్శిస్తే తప్ప, మన నాటకాలకు విలువ ఉండదనే దురభిప్రాయాన్ని మనం మొదలంట తెగనరకాలి. యెక్కడ ఏపాక దొరికితే, ఏ అరుగు దొరికితే, ఏ ఆచ్ఛాదన దొరికితే, అక్కడే స్టేజీని నిర్మించుకునే పద్ధతులను మనం తెలుసుకోవాలి. అక్కడ మన నాటకాలను కళారుచిరంగా ప్రదర్శించడానికై వలసిన టెక్నికల్ శిక్షను మనం పొందివుండాలి. ఈ పద్ధతుల్ని తెలుసుకోవాలన్నా ఈ టెక్నికల్ శిక్షను పొందాలన్నా ఏ ఒక్కరి వల్లా అయ్యేపని కాదు. దీనికి ఒక కేంద్రసంస్థ వుండాలి. ఆ కేంద్ర సంస్థ ఒక నాటక కళాశాలను నిర్వహించాలి. ఆకళాశాలలో సిద్ధాంతానికి (Theory), ప్రయోగానికి (Experiment) వలసిన సామగ్రి వుండాలి. అంటే ఒక నాటక కళా సాహిత్య గ్రంథాలయం, ఒక ప్రయోగశాల (Experimental theatre) వుండాలి. ఇవి మన అమెట్యూర్ల కనీస అవసరాలు. ఈఅవసరాల్ని గుర్తించిన సంస్థ, ఇంతవరకూ తెలుగుదేశంలో ఒక్కటే మనకు కనిపిస్తూవుంది. అది, విజయవాడలో వున్న తెలుగు లిటిల్ థియేటర్. కొన్ని వందలు పుస్తకాలుగల ఒక అమూల్య నాటక సాహిత్య గ్రంథాలయాన్ని వారు ఏర్పరచారు. పరదేశాలనుండి ఎన్నో నాటక కళాపత్రికలు ఆ గ్రంథాలయానికి వస్తువుంటాయి. అన్నిటికంటే గమనించవలసిన విషయం - నాటక ప్రదర్శనంలో అధునాతనత్వాన్ని సాధించడానికై వలసిన స్టేజి లైటింగు పరికరాలను కొన్ని వేలు వెచ్చించి ఇంగ్లండునుంచి తెప్పించారు.

ఈ గ్రంథాలయాన్నీ స్టేజి లైటింగు పరికరాలనూ ఆధారం చేసుకుని, వారు, చిన్న స్కేలులో ఒక నాటక కళాశాలను విజయవాడలో నడపడానికై యత్నాలు చేస్తున్నట్లు కూడా వింటున్నాము. ఈ సందర్భంలో మన తెలుగుదేశంలోని అనేక ఎమెట్యూర్ నాటకసంఘాలను ఒక యావదాంధ్ర ఎమెట్యూర్ థియేటర్ గిల్డుగా సంఘటిత పరచడానికి, ఆ గిల్డు యాజమాన్యాన ఈ గ్రంథాలయాన్నీ స్టేజి లైటింగు పరికరాలనూ ఎమెట్యూర్ నాటకోద్యమ వికాసానికై వినియోగపరచడానికీ, సంకల్పించుకున్నట్లు తెలియవస్తున్నది. ఇది ముదావహమైన విషయం.

ఎమెట్యూర్ నాటకరంగ వికాసానికి అడ్డంకులు కలిగిస్తున్న మరో కొన్ని గడ్డు సమస్యలున్నాయి. వాటిల్లో ఒకటి, వినోదపుపన్ను. వ్యాపారదృష్టితో నాటకాలాడే కిరాయినటుల్నీ, వ్యాపారదృష్టి లేకుండా ఫలాపేక్ష రహితంగా ఆడే ఎమెట్యూర్లనీ మన ప్రభుత్వం ఒకే బద్దతో కొలవడం శోచనీయం. కిరాయి నటులకు లేని కళాశయాలు కళాభిరుచులు కళాదర్శాలు ఎమెట్యూర్ల కున్నాయి. నవ్యపద్ధతుల్లో వ్రాయబడిన నాటకాలను ప్రదర్శించడానికై ఎమెట్యూర్లు ఉత్సాహం చూపుతున్నారు. నాటక ప్రదర్శనాలలో అభినయంలో రంగ పరికరాలలో స్టేజిలైటింగులో ఇతర టెక్నికల్ విధానాలలో కొంగ్రొత్త మార్గాలను అన్వేషించడానికై వారు ముందంజ వేస్తున్నారు. అయితే, నవ్యపద్ధతులకు మన ప్రజానీకం ఇప్పుడిప్పుడే అలవాటు పడుతూ వుంది. పాత పక్కీలు పూర్తిగా పోలేదు. కొత్తవి పూర్తిగా రానూలేదు. ఈ సందిగ్ధంలో ఎమెట్యూర్ నాటకాలు ఆర్థికంగా దెబ్బతినడం జరుగుతూ వుంటుంది. అలా కొన్ని దెబ్బలు తింటే ఆ సంఘాలు పడుకుంటాయి. దాంతో, నాటకరంగంయొక్క పురోగమనం కూడా దెబ్బ తింటుంది. తెలుగునాటక రంగంయొక్క భవిష్యత్తు సర్వం, ఎమెట్యూర్ల మీదనే ఆధారపడివుంది. ప్రతి నాగరిక దేశంలో ప్రతిప్రభుత్వం తన జాతీయ నాటకరంగాన్ని అనేకవిధాల పోషించుకుంటూ వుంది. మన మద్రాసు ప్రభుత్వం చెయ్యవలసిన కనీస సహాయం ఏమిటంటే, వ్యాపారదృష్టి లేనటువంటివీ లాభాలు పంచుకోనటువంటివీ (నాన్ ప్రాఫిట్ షేరింగ్) ఎమెట్యూర్ నాటక సంఘాల మీద, ఎమెట్యూర్ నాటక కళా సంస్థల మీద, ఎలాంటి వినోదపుపన్నూ విధించరాదు. ఈ విషయాన్నిగురించి మన ఎమెట్యూర్ నాటక సంఘాలన్నీ తమ ఐక్య కృషిద్వారా ప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకురావాల్సిన అవసరం ఎంతైనా వుంది. ఇందుకు మొదటిమెట్టు ఏమిటంటే- దేశంలోని అమెట్యూర్ నాటక సంఘాలన్నీ కలిసి ఒక యావదాంధ్ర ఎమెట్యూర్ థియేటర్ గిల్డు అనే ఒక అధికారసంస్థగా ఐక్యం కావాలి. ఎమెట్యూర్ల యొక్క కళాదర్శాలను, ఆశయాలను అభిరుచులను హక్కులను, కంటికి రెప్పవిధంగా కాపాడగల అలాంటి గిల్డు ఒకటి, ఎంత అవసరమో మరో విషయం ఋజువుచేస్తున్నది. ఏమిటంటే, ప్రభుత్వం వారు ఒక కమిటీని వేసినప్పటినుంచీ, నాటకకళాపీఠుల్లో కొన్ని వదంతులు బయలుదేరాయి. నాటకాలకు ఒక సెన్సారు బోర్డును నియమిస్తారనీ, నటీనటులు సర్టిఫికెట్లు పొందాలనీ, సర్టిఫికెట్లు పొందిన వారికే నాటకమాడే హక్కు వుంటుందనీ, పొందనివారిని నిషేధిస్తారనీ, ఏమేమో వింత వింత వదంతులు బయలుదేరాయి. నిప్పులేకుండా పొగరాదు. ఈ వదంతులకు కూడా కొన్ని కారణాలు కనపడుతున్నాయి. ఇటీవల ఏలూరులో జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్తు సందర్భంలో అధ్యక్షులు శ్రీ స్థానంవారిచ్చిన ఉపన్యాసంలో ఈ వాక్యాలను గమనించండి. "మన పరిషత్సన్మాన గౌరవాలనూ పట్టాలనూ పొందిననట సంఘాలకే నటులకే మనప్రభుత్వంగాని మునిసిపాలిటీలుగాని ప్రదర్శనావకాశం కలిగించాలని కోరడం, కళాసేవదృష్ట్యా ఎంతమాత్రం తప్పుకాదనే స్థిరసంకల్పంతో పట్టుపట్టాలి". శ్రీ స్థానంవారేమరోచోట ఇలా సెలవిచ్చారు. "నాటకాలకు ఒక సెన్సారుబోర్డు అవసరం". "రాష్ట్రాన్ని కొన్ని ఫిర్కాలుగా విభజించి ఒక్కొక్క ఫిర్కాలో ప్రముఖుల నుంచి, నట్యనావిధానం యెరిగిన ఒకరినీ, నాటక రచయితనుగాని విమర్శకునిగాని ఒకరినీ, మునిసిపల్ ఛైర్మన్‌ను (i) ఒకరినీ, మొత్తం ముగ్గురు సభ్యులతో ఒక కమిటీని నియమించి వారు విధిగా ప్రదర్శనాలకు హాజరవుతూ, వారు తెలిపే అభిప్రాయానుసారంగా సెన్సారుబోర్డువారు వ్యవహరిస్తూ అవసరమైన కళా సంస్కరణను (ii) చేస్తూవుండాలి" (30-4-48 తేదీగల 'జమీన్ రైతు' పత్రికలో స్థానం వారి వ్యాసంనుంచి) స్థానంవారి ఉద్దేశాలు ఎంత సంకుచితంగా వున్నాయో వివరించి చెప్పడం అనవసరం. మునిసిపల్ ఛైర్మన్ల యొక్క సెన్సారు కమిటీలయొక్క అధికార ప్రాబల్యంతో నాటకకళను సంస్కరించడమనేపద్ధతి ఏ నాగరిక దేశంలోనూ ఇంతవరకు జరగలేదు. ఇలాటి విధానం వల్ల సంస్కృతియొక్క కళలయొక్క సహజసక్రమ వికాసం కుంటుపడుతుంది. స్వేచ్ఛావాయువుల్ని పీల్చనీయకుండా ఏనాడు మన కళల్ని నాలుగు గోడల సందున బంధిస్తామో, ఏనాడు వాటిని సెన్సారుబోర్డుల నిరంకుశత్వానికి పాలు చేస్తామో, ఆనాడు మనకళలు వెర్రితలలు వేస్తాయి. వికటఫలాన్ని ఇస్తాయి. తమ కళల్నీ సంస్కృతినీ ఇనపచట్రాలలో బిగించుకునేజాతికి భవిష్యత్తులేదు.

శ్రీ స్థానంవారి సంకుచితభావాల్ని మనం పాటించినా పాటించకపోయినా, ఒక్క విషయాన్ని మటుకు పాటించి తీరాలి. ఏమిటంటే, అలాటి ఉద్దేశాలు గల వ్యక్తిని మన ప్రభుత్వం తన కమిటీలోకి తీసుకోవాలని ఎందుకు లాక్కుంది? ప్రభుత్వానికి కూడా అలాంటి సంకుచిత భావాలే వున్నాయా? ఏమో! కాగా, సర్వవసానం ఏమంటే, అలాటి సెన్సారు బోర్డులుగాని లైసెన్సులుగాని తద్విధాలు గాని మన కళలమీదయొక్క [illegible] నృత్యం చెయ్యకుండా, ఇప్పటినుంచీ మనం జాగ్రత్తపడాలి. ఈ జాగ్రత్తల్ని తీసుకునే కేంద్రసంస్థ మనకు శీఘ్రంగా వుండాలి. అదే మనం కలగంటున్న యావదాంధ్ర ఎమెట్యూర్ థియేటర్ల గిల్డు. దాని అవశ్యకత, మనకు ఇప్పుడు పూర్తిగా బోధపడుతూవుంది. దానికోసం అందరం సత్వరకృషి చేద్దాం. ఇదివరకే కృషి ప్రారంభించిన తెలుగు లిటిల్ థియేటర్ లాటి సంస్థలతో చేతులు కలుపుదాం. మన ఎమెట్యూర్ల భవితవ్యం విముక్తి మన చేతుల్లోనే వున్నాయి. "పదండి ముందుకు పదండి తోసుకు! పోదాం పోదాం పైపైకి!"

శ్రీ మాడపాటి హనుమంతరావుగారు దేశోద్ధారకునిగురించి ఉపన్యసించుచున్నారు. ఎడమవైపున చిత్రములో కూర్చుని యున్నవారు శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు : హైదరాబాద్‌లో దేశోద్ధారకుని వర్ధంతి.

బొంబైలో రాష్ట్రపతి డా॥ పట్టాభి, వారిప్రక్కనే రాష్ట్రప్రధాని బి. జి. ఖేర్ గారు.

పొలంలో పండేగడ్డికి బాగా ఆరబెట్టి, సునువుగా కావలసినచోటుకు చేర్చుకునేటందుకు వీలుగా చక్కని మోపులుకట్టే ఈ యంత్రాన్ని బ్రిటిష్ వ్యవసాయదారులు (హెర్ట్‌ఫోర్డ్ షైర్‌లో) ఇప్పుడు ఉపయోగిస్తున్నారు.

**మృతశిశువు శిరోజాలు దువ్వుతోంది!** చచ్చిపోయిన శిశువు శిరోజాలు దువ్వనపెట్టి తాపీగా దువ్వగలగటం మీకు ఆశ్చర్యాన్ని కలిగించవచ్చు—అయితే ఆతల్లి తాపీగా దువ్వటంలేదు. ఏడుస్తూ, ఎంత ఏడ్చినా, పిల్లమీదపడి ఎంత రొమ్ము బాదుకున్నా, తలచేతుల్తో మొత్తుకున్నా, తీరని బాధతో విధికిలోనై దువ్వుతోంది శిరోజాలు తల్లి.

మండలం దినాలు మంచంలో నవిసి కళ్యాణకళిత్తమై చుట్టపక్కాలు పస్తశ్రీవకు, ఆ జీవనకు విషమంగా ఫలించింది మృత్యువు. ఫోటో తీయించుకోని మట్టి గలిసిన దేహపు ఆకారాన్ని కాగితంమీద బొమ్మగా జేసి చూసుకుందామని, దాంతో అప్పుడప్పుడు తృప్తిపడ్దామని...

## కథానిక : సత్రంలో సంసారాలు

శిరోజాలు దువ్వుతోంది. ఏడుస్తోంది. మళ్ళా దువ్వుతుంది...మళ్ళా మొత్తుకుంటుంది.

చిన్న మెత్తు ఫలితం కలుగుతుందని నమ్మకం కలుగులే బండలెత్తగలుగుతారు ప్రజలు.

ఒక్కొక్క వ్యక్తికి కలిగే కష్టాలు మనకు గ్రాసాకు అందకుండా వుంటాయి. మన అనుభవంలో సంఘం ఎంతమందిని సముద్రంలో పారేయటం చూట్టంలేదు? విధి యింతకన్నా ఘోరాలు చేయగల సమర్థనీయ.

ఈ మృతశిశువు జీవితం చూడండి కొంచెపీస్తే. తండ్రి చనిపోయాడు లేక పుట్టుకలో. తల్లికి తా నొక్కర్తే పదేళ్ల కూతురు. తానూ దాటిపోయింది. ఈ ఫలితం అనుభవించాలి న్నంచెవరు? ముప్ఫయియేళ్లు గడిచి, సంతానం కలిగి, వారికి పోషణ జరిపి, చివర కంవర్ని మట్టిపాలు చేసి, హృదయానికి దగ్గర వ్యక్తిలేని జీవితం ఎలా గడపాలి తల్లి?

"యీమె యాభయివేలకు అధిపతి," అంటున్నారుగదా జనం.

"ఈ డబ్బు ఏం చేయను?"

ఇలా సత్రంలో ఆరునెలల పాటు వుండి వచ్చే పోయే జనాభాయొక్క పరిస్థితి మాస్తుంటే జుగుప్స, కరుణ, కొంతమందికి ఏవగింపు, ఇంకా ఎన్నో విధాలు చూడగలుగుతాము.

ప్రేమికులు, ప్రాస్టిట్యూట్స్ (prostitutes) తల్లులను పోల్పోయిన పిల్లలు పిల్లలను పోల్పోయిన తల్లులు, బైరాగులు

**సి. వి. కృష్ణారావు**

బిచ్చగాళ్లు, యిల్లు వుండి యింట్లోకష్టాలు భరింపలేక ఒక నిముషం అరుగుమీద కూర్చొని వెళ్లిపోయ్యేవాళ్ళు, ఒక వింతైన కరుణామయజగత్తు కనపడుతుంది.

గ్రామాల్లో పనుండో, దేవుడికి మ్రొక్కుదామని వచ్చి ఒకటి రెండు రోజులుండి వెళ్లేజనంలో ఎక్కువ మందిని మనం పరిశీలించి చూస్తే సంవత్సరాలు తరబడి చూడజాలని ఆశ్చర్యకరమైన విషయాలు మనం చూడవచ్చు.

ఇలాంటిది ఒక విషయం చెపుతాను. ఒక స్త్రీ నెల రోజుల బట్టి సత్రంలో ఉంటున్నది. వయస్సు పద్దెనిమిదేళ్లు. అయితే "నాటింగ్ హోమ్ గూని మనిషి" (Hunchback of nottingham) పురుషుడయితే స్త్రీలలో అలాంటి వ్యక్తి యీమె ఒక్కతే కనపడ్డది.

ఈ స్త్రీ విషయం నేను యింటి యిదిగా వ్రాయపనిలేదు; కాని ప్రపంచంలో ప్రతి వ్యక్తి దగ్గరా నేర్చుకోదగ్గ గుణంగాని సత్యంగాని వుండి తీరుతుంది.

నేను ఎప్పుడు ఆమె ముఖం చూడాలని ప్రయత్నం చేసినా మాపలే! పోయే వాళ్ళు; నెల రోజుల్లో ఏ ఒక్కసారి ఆమె ముఖం దాకానో గుర్తులేదు.

ఆమె వచ్చిన మొదటి రోజుల్లో "అందర్నీ అలా చూస్తుంది," అన్నారు మాస్నేహితుడొకడు.

నేను ఆమె జీవితం విషయం చాలా విచారం పడ్డాను. ఏ స్త్రీ దగ్గరకురాని పురుషుని జీవితం ఎలాగో, ఏ పురుషుడు కన్నెత్తి చూడని స్త్రీ జీవితం ఎంత నిక్రుష్టంగా ప్రాహించటానికి చాలాకష్టం. ఈమె సంగతి ముందు చెప్తాను.

సత్రంలోనంటే ఒకరిద్దరు వుండేదికాదనీ, "యిలా సత్రం వుంటుంది", అని చెప్పటానికి ప్రయత్నిస్తే, అప్పటికే చాలా లోటు జరగాల్సిందే. యిదీ సత్రం వ్యవహారం.

రాత్రి ఎనిమిది గంటలకు వస్తున్నాను. ముందువరండామీదపదిమంది గోసాయిలు. గోసాయిలు మస్తీ అడుక్కోటానికి యింటికి వస్తే సన్యాసులనీ, మహాపవిత్ర స్వరూపులనీ వారి ఆకారం—గడ్డం, మంగలి ముట్టుకోని జుట్టూ, విరాగిత్వం సూచించే దుస్తులూ—మనకు సూచనలు చేస్తుంది. వారు వేదాంతసారం గ్రోలి జీవితసౌఖ్యాలను సపర్యజించి విరాగులైనారు.

అయితే ఇలాంటి సన్యాసులు వారి రాత్రి బసలో కూర్చున్నప్పుడు చూడాలి వింత! ప్రతి గోసాయికీ నా అనుకొన్న వస్తువులు ఒక్క చిన్న జేటిసంచీ, గుడ్డలు, గంజా తాగే గొట్టం, కమండలం.

ఒకతన్ని, 'మీ దెక్కడ్నించి' అంటున్నాడు చుట్టూ కూచొని గంజా దమ్ములు పట్టేవాళ్లలో ఒకతను.

"ఒకచోట నుంచని లేదు," అంటున్నాడు. ఇతను కొత్తగా వచ్చాడు కాబోలు.

సీవలోనిలబడి విన్నాను. ఉద్యోగం పోయిందట. కొన్నాళ్లు ఒకచుట్టం అండతో వూరు కట్టెల వ్యాపారం చేస్తే నష్టం వచ్చింది. తరువాత యిసకమీద పస్తచేఫలాగా తిరిగి, యింటికి వచ్చేప్పటికి, "ఏం తెచ్చావు?" అంది మంచం మీంచి లేవకుండా భార్య. బావమరది మందలించలేదు.

"పిల్లవాడు బళ్ళోకి పోయినాడు; చూసేందుకు నీళ్లేక పోయింది; యిప్పటికీ కళ్లల్లో మెదుల్తున్నాడు." అన్నాడు గోసాయి.

"వెంటనే కాలికి రోడ్డప్పగించా వన్నమాట." అన్నాడింకో గోసాయి.

"పిల్లవాడంటే నాకమిత ప్రాణం; అయినా భార్య అన్నమాటకు మనసువిరిగి ఆక్కడో నిముషం వుండలేదు;" అన్నాడు.

అందరూ విరగబడి నవ్వారు.

"యింకా నీమనసులో ఎక్కడో వలుకుంది." అంటున్నాడు మూడోతను.

లోపలికి నడుస్తున్నాను.

నడుంకు గోనెసంచి కట్టుకొని మోకాళ్ళించి పిక్కదాకా గుడ్డలు చుట్టుకున్న బిచ్చగాడు పరంగా కింకో ప్రక్కన కూర్చొని వున్నాడు.

అతన్ని పగలే రోజూ మాస్తుంటాను. ఎప్పుడన్నా కట్టు విప్పదీసి, పాతగుడ్డతో సెప్టు తుడుస్తుంటాడు. అప్పుడు మూడటానికి కళ్ళు యితే వప్పుకోవు!

ఇతను బ్రతుకడు; అని నిశ్చయించు కున్నా. గొబ్బెటి లోపలకు వచ్చాను. ఆంజనేయ స్వామికి నూరుకొబ్బరికాయలు కొడతానని మ్రొక్కుంది, ఒకవిధవరాలు, తమ్ముడికి జబ్బునయమయితే. జయదేవగీతాలు పాడుతోంది. ప్రతిరాత్రి ఆమె పాటపాడుతోంది ఆటూయిటూ వచ్చేప్పుడు ఎప్పుడు చూచినా ఏకో పుస్తకం చదవటం, లేకపోతే యిద్దరు ముగ్గుర్ని కూడబెట్టి కృష్ణుని రాసక్రీడలు మహానందంలో వర్ణించటం జేగేతీలు వినటం ముక్తిమార్గానికి ఎలా సుబోధకాలో వినే వారందరికి వర్ణిస్తుంది.

(10-వ పేజీ చూడుడు)



ఎప్పటికైనా విశాలాంధ్రం ఏర్పడక తప్పదని విశ్వసించే...

# సర్దార్ జమలాపురం కేశవరావు

సర్దారు జమలాపురం కేశవరావుగారికి 'సహనావవతు సహనౌ' జనమస్వంలో తప్ప విడిగా ఉండలేదు. ఆయన ఒక మహోత్తరమయిన ఉద్యమం. ఎంత గుండె లేనివాడయినా, ఆయన సముఖంలో ఉత్తేజితుడవుతాడు. తెలంగాణంలో జనసముదాయ ప్రథమ యోధుడు.

ఆరడుగుల పొడవు - ఆజానుబాహువు. ముఖంలో యేదో విపరీతమయిన ఆవేదన కనిపిస్తుంది. నిశితమయిన ఆయన చూపుల్లో సామాన్యుని అంతరంగం ద్యోతకమవుతుంది. శరవేగంతో గమిస్తాడు. అనురాగం ప్రతిపలుకులోనూ ప్రతిఫలిస్తుంది. సంచారం చేస్తున్నప్పుడు స్వవిషయం మరచిపోతాడు. పత్రికా జనాన్ని దూరంగా ఉంచుతాడు. 'స్వోత్కర్ష' అనే పదానికి యీనాటికీ ఆయన నిఘంటువులో స్థానం లేదు.

ఎర్రుపాలెం జన్మస్థలం. నలభయి ఒక్క సంవత్సరాలు వయస్సు. విగ్రహాన్ని చూస్తే అగంతకులకు ఆయన పల్లెటూరి రైతులా తోస్తాడు. కాని యెంతో చదువుకున్నవాడు, సంస్కారి. విచక్షణ, పెద్దమనిషి తరహా, జ్ఞాపకశక్తి - ఆయన కున్నట్టు మరెవ్వరికీ సామాన్యంగా ఉండవు.

రెవెన్యూశాఖలో ఉద్యోగం చేస్తుండగా 1938 లో సంస్థాన కాంగ్రెసు సత్యాగ్రహ సందేశాన్ని ఇచ్చింది. వెంటనే ఉద్యోగానికి తిలోదకాలిచ్చాడు. సత్యాగ్రహ సమరంలో అగ్రగామిగా నిలిచాడు. ప్రభుత్వం వల్ల నిర్బంధించబడ్డాడు. రెండు సంవత్సరాలు కఠినశిక్ష వేశారు. కాని ఆరుమాసాలకే ప్రభుత్వం విడిచిపెట్టింది. ఈ ఆరుమాసాల్లోనూ చెరసాలలో యీయన యమయాతన అనుభవించాడు. సత్యాగ్రహసందర్భంలో యీయన ఉపన్యాసాన్ని వినటానికీ, యీయన్ని దర్శించటానికీ వచ్చిన వేలాదివేల జనసమూహం యీయన పలుకు పలుకికీ నివర్శనం కావటంవల్ల యీయన్ని యేదో విధంగా అణచివేయాలని ప్రభుత్వం తలపెట్టింది. ఎన్ని బాధలనయినా సహించాడు కాని ప్రజానీకం ముందు తను చేసిన ప్రతిజ్ఞను విస్మరించలేదు. రాజకీయ ఖైదీలందరూ ఒకసారి అధికారుల హింసాకాండను భరించలేక జయిలులో తిరుగుబాటు చేశారు. అధికారులు దుర్బలులయి కేశవరావుగారిని శరణువేడారు. గాంధీజీ సిద్ధాంతాలకు కట్టుబడిన ఆయన హృదయం, అధికారులను రక్షించింది. రాజకీయ ఖైదీలను శాంతపరిచింది.

సంస్థాన కాంగ్రెసును నిజాం ప్రభుత్వం నిషేధించింది. తన్మూలంగా రాష్ట్రీయ మహాసభలు యేర్పడినవి. ఆంధ్రమహాసభలో కేశవరావు గారు చేరారు. పల్లె పల్లెకూ స్వాతంత్ర్యసందేశాన్ని స్వయంగా కాలినడకపయి పోయి ప్రజానీకానికి వినిపించాడు. యువజనులను స్వాతంత్ర్య సమరయోధులుగా తయారు చేశాడు. వరంగల్లు జిల్లా మహాసభకు అధ్యక్షుడు

### "వరద"

గానూ, కార్యదర్శిగానూ పనిచేశాడు. ఆంధ్రమహాసభ పదమూడో సమావేశానికి యీయన్ని యేకగ్రీవంగా ప్రతినిధులు అధ్యక్షపదవికి యెన్నుకున్నారు. రెండు సార్లు తిరిగి వరుసగా అధ్యక్షుడుగా యెన్నిక అయినాడు. తెలంగాణంలోని రాజకీయోద్యమం యీయన అధ్యక్షత్వం క్రిందనే ఒక స్వరూపం పొందింది. వేలాది యువజనులు యీయన నాయకత్వం క్రింద స్వాతంత్ర్య సమరంలో పాల్గొనటానికి సంసిద్ధులై వున్నారు. జానపద హృదయాల్లో యీయన సందేశం హత్తుకొని పోయింది.

1946 లో సంస్థాన కాంగ్రెసు పై నిషేధాన్ని ప్రభుత్వం ఉపసంహరించుకొన్నది. రాష్ట్రీయ మహాసభలు రాష్ట్ర కాంగ్రెసు సంఘాలుగా పరిణతి పొందినవి.

సర్దారు కేశవరావు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షు డయినాడు.

బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనకు సత్యాగ్రహం ప్రారంభమయినప్పుడు సర్దారు కేశవరావు మధిరలో సత్యాగ్రహం చేశాడు. భారత సైనికచర్య జయప్రదంగా పరిసమాప్తి చెందేంతవరకూ యీయన కారాగారంలో నిర్బంధం అనుభవించాడు. జయిల్లో యెన్నోసార్లు మృత్యుముఖం నుంచి తప్పించుకున్నాడు. రజాకారులు యీయన్ని హత్యచెయ్యాలని ప్రయత్నం చేశారు. కేవలం దైవికంగా వారి ప్రయత్నాలు ఫలప్రదం కాలేదు.

శ్రీ కేశవరావుగారు ఆంధ్రాభిమాని. ఎన్నటికయినా విశాలాంధ్రం యేర్పడక తప్పదని నమ్ముతారు. అందుకోసం విధీ విరామం లేకుండా అహోరాత్రాలూ పరిశ్రమిస్తాడు.

పదవులంటే పరమ అసహ్యం ఆయనికి. అంతఃకలహాలంటే అసలే పడదు. ఈమధ్య కాంగ్రెసులోని అంతర్విభేదాలు పరిష్కృతం అయినవంటే ఆయన చేతి చలవే. అన్ని వర్గాలవారికీ ఆయనలో విశ్వాసమున్నది. ఆయన అంటే భయమూ ఉన్నది.

తెలంగాణంలోని ఎనభయి లక్షల ఆంధ్రులను కూడగట్టుకుని ఆంధ్రాభ్యుదయానికి పాటుపడే నాయకవతంసుడాయన.

జనసేవాపరతంత్రుడూ, నిరాడంబరుడూ, స్వార్థ రహితుడూ అయిన సర్దారు జమలాపురం కేశవరావుగారు నాలుగు కాలాలపాటు వర్ధిల్లాలని ప్రతీ సామాన్యపౌరుడూ సదా ఆశిస్తాడు.





## హైదరాబాదు లేఖ

# సంస్థానప్రభుత్వంలో వున్న కొద్దిమంది ఆంధ్రులకు అన్యాయం

[మా ప్రత్యేక విలేఖరి]

హైదరాబాదు సంస్థాన ప్రభుత్వపు రెవెన్యూశాఖా కార్యదర్శిగానున్న శ్రీ ఇల్లెందుల రామచంద్రరావుగారి స్థానములో, గ్రామ పునర్నిర్మాణ శాఖా కార్యదర్శిగానున్న రాం లాల్ గారిని నియమించిరి. శ్రీ రామచంద్రరావు నూతన పదవి ఏదియో ప్రభుత్వమువారు ప్రకటింపలేదు. గాని, ఏదియో యొక జిల్లాకు తాలూక్దారుగా నియమించవలెనని యే ప్రభుత్వము నిశ్చయించినట్లు కన్పడుచున్నది. రామచంద్రరావుగారిని యీ విధముగా తక్కువ హోదాకు దించివేయుటలో ప్రభుత్వాభిప్రాయ మేమియో తెలియదు. శ్రీ రామచంద్రరావు, హైదరాబాదు సివిల్ సర్వీసు (హెచ్.సి.యస్) పరీక్షలో ప్రథములుగా నెగ్గిరి. తర్వాత అనేక శాఖలలో పనిచేసి సమర్థులనిపించుకొనిరి. వారిని మిలిటరీ ప్రభుత్వమువారు రెవెన్యూ కార్యదర్శిగా నియమించిరి. కాని ఔరంగాబాదు జిల్లా సివిల్ అడ్మినిస్ట్రేటర్ అయిన రాజ్వాడే గారు-తాను ఐ. సి. యస్ అధికారినై ఒక హెచ్. సి. యస్. అధికారి క్రింద పని చేయజాలనని ప్రభుత్వమునకు తెల్పిరనియూ, ఆ విషయమై ప్రభుత్వ మాలోచించులోపల ఆరు వారములు సెలవు తీసికొనిరనియు తెలియుచున్నది. పోలీసుచర్య తర్వాత ఇంతవరకు రెవెన్యూ కార్యదర్శి, ఉపకార్యదర్శి ఆంధ్రులే. ఉపకార్యదర్శి అయిన నాగులపల్లి దుర్గయ్యగారు రెవెన్యూ శాఖలో 20 ఏండ్లనుంచి పనిచేయుచున్నవారు. నేడు వారిని అమాంతముగా నిజామాబాదు తాలూక్దారుగా మార్చి, వారి స్థానే సేతుమాధవరావుగారను నొక కన్నడుని నియమించిరి. అంతటితో ఆగక, రామచంద్రరావుగారినికూడా తీసివేసి, వారి స్థానములో రాం లాల్ గారిని నియమించిరి. ప్రస్తుతము రామచంద్రరావుగారు రెండు నెలలు సెలవు తీసికొనిరి.

ప్రభుత్వకార్యదర్శులుగా నున్న పదహారుమందిలో ముగ్గురుమాత్రమే ఆంధ్రులు. పి. దట్లియు. శాఖా కార్యదర్శి శ్రీ వేపా కృష్ణమూర్తి, రెవెన్యూశాఖా కార్యదర్శి శ్రీ ఇల్లెందుల రామచంద్రరావు, సప్లై శాఖా కార్యదర్శి శ్రీ కె. వి. విద్యాసాగర్, వేపా కృష్ణమూర్తిగారు ఇచటికి పోలీసుచర్యానంతరమువచ్చిరి. మిగిలినవారిద్దరునూ మొదటినుంచి ఇచటనే పనిచేయుచున్నవారు. వీరుగాక, ఉప కార్యదర్శులుగాగాని, సహాయ కార్యదర్శులుగాగాని పనిచేయుచున్న ఆంధ్రులు బహు కొద్దిమంది. ప్రధాన కార్యదర్శి ఆఫీసులో సహాయ కార్యదర్శిగానున్న శేషగిరిరావుగారిని అత్రాఫ్ బల్దా జిల్లా తాలూక్దారుగా ఈ మధ్యనే మార్చివేసిరి. విద్యాసాగర్ గారిని కూడా తాలూక్దారుగా మార్చెదరని నమ్మకముగా తెలియుచున్నది. అది జరుగులోపలనే వారు సంస్థానమును వదలి పోవలెనని ప్రయత్నించుచున్నట్లు తెలియుచున్నది.

వీరుగాక, సహాయ కార్యదర్శులుగాగాని, ఉపకార్య దర్శులుగాగాని పని చేయుచున్న ఆంధ్రులు అర్థికశాఖలో ముగ్గురు, న్యాయశాఖలో ఒక్కరునూ కలరు. ఈ పదవులు మినహా, ఏ శాఖలోనూ డైరెక్టరుగా ఒక్క ఆంధ్రుడు లేడు. ఒక్క హైదరాబాదు పోలీసు కమీషనర్ మాత్రం ఆంధ్రుడు, చివరకు జిల్లాల సివిల్ అడ్మినిస్ట్రేటర్లుగా కూడా ఒక్క కరీంనగరము జిల్లాకు తప్ప ఆంధ్రులు లేరు. నిజామాబాదు, మహబూబునగరం, నల్గొండ జిల్లా పోలీసు సూపరింటెండెంట్లు మాత్రము ఆంధ్రులు. అంతియే, చివరకు తాలూక్దార్లు కూడా నల్గురైదు గురు మాత్రమే ఆంధ్రులు.

పూర్వపు పరిస్థితి ఎట్లున్నను, నేడు మిలిటరీ ప్రభుత్వము పనిచేయుచున్నది. సంస్థానములో సగభాగము నాక్రమించుచున్న ప్రాంతమువారికి ఉద్యోగములలో దాదాపు సగము ప్రాతినిధ్యము ఉండవలసియుండెను. అట్టి ప్రాతినిధ్యము లేకపోగా, ఉన్న కొలదిమందికీ కూడా ఇట్టి మన్నన జరుగుచున్నది. వీరు గాక తక్కువ పదవులలో అనేక సంవత్సరములనుండి పడియున్నవారనేకులు. ప్రజానాయకు లెవ్వరునూ, ఈ అన్యాయమును గూర్చి ఇంతవరకు నోరెత్తలేదు. ఈ మధ్య ఎన్నికల శాఖాకమీషనర్ను ఒక్క సారిగా రెవెన్యూమంత్రిని చేసినైచిరి. ఇప్పుడు ఉన్నవారినే తీసివైచుచున్నారు. కమ్యూనిస్టు ఉద్యమము అణగిపోవునకు ప్రభుత్వమును విమర్శించుట క్షేమకరము కాదు కదా. విమర్శను పట్టి ఎర్రబట్టతో సింగారించి, దానిపై రాజకీయ గ్రోహము నాపాదించుట నేటి ప్రభుత్వ నాగరికత!

ఏమైనప్పటికినీ, ఈమధ్య కన్హైలాల్ మున్షీ గారు, ఆంధ్రులు గాంధీతత్వము నైపుకంటె, కమ్యూనిజము నైపుకే మొగ్గుచున్నారని బెజవాడలో వెలవిచ్చిన సంగతిని ఆంధ్రులు మరువరాదు. అదే ప్రభుత్వ భావమని తెలిసికొనినవారెందరు?

[Photo] గతవారము నల్గొండలో ప్రభుత్వమువారిచే ఒక ప్రదర్శన మేర్పాటు చేయబడెను. అందు కమ్యూనిస్టులతో ప్రజలు సహకరింపరాదని, సహకరించినచో కల్గు ప్రమాదములును, వివిధ కార్యక్రమములద్వారా, ప్రజానీకమునకు తెలియజేయబడెను. ప్రదర్శనములో వ్యవసాయశాఖవారు, ఆరోగ్యకరమైన ఆహారమును తయారుచేయు పద్ధతులను వివరించిరి. ప్రదర్శన ప్రారంభకులు మేజర్ జనరల్ చౌదరి, వ్యవసాయ ప్రదర్శనమును చూచుచున్నారు. వారి ప్రక్కనే నల్గొండ సివిల్ అడ్మినిస్ట్రేటర్ శ్రీ జోగప్ప నిలచియున్నారు.

### సంస్థాన ఆంధ్రకాంగ్రెసు కార్యవర్గం

సంస్థాన ఆంధ్రకాంగ్రెసు కార్యవర్గము వారు రెండురోజులు శ్రీ జమలాపురం కేశవరావు అధ్యక్షతక్రింద సమావేశమై, రాష్ట్రసమస్యలన్నింటినీ చర్చించుచూ, పునరావాస కార్యక్రమమును పూర్వనిర్ణయప్రకారము ఏప్రిల్ నెలాఖరుతోనే నిలపివేయకుండగా, మే నెలాఖరు వరకు కార్యక్రమమును నడుపవలెనని తీర్మానించిరి. నష్టపడిన రైతులనేకుల కింకనూ తక్కావీఋణములు లభింపలేదనియు, చాలామంది గ్రామీణులకు ఇంకనూ ఇండ్లు కట్టుకొనుటకు కావలసిన వస్తువులు లభింపలేదుగాన వారికి అటవీశాఖవారు కలపనిచ్చి సహాయము చేయవలెననియూ కార్యవర్గమువారు తీర్మానించిరి. అదిగాక, వరంగల్ నల్గొండ జిల్లాలవారికి ఇంకనూ ప్రశాంతితో వాతావరణము లభింపలేదు. ఆ జిల్లాలలో పునరావాస సౌకర్యములను కలుగజేయవలసిన ఆవశ్యకత ఎంతో వున్నదని కూడా తీర్మానములో తెలుపబడెను.

కార్యవర్గ సమావేశమునకు శ్రీయుతులు బూర్గుల రామకృష్ణరావు, కొండా వెంకటరంగారెడ్డి, (అత్రాఫ్ బల్దా) పల్లెర్ల హనుమంతరావు (మహబూబునగరం), హనుమంతరెడ్డి (నిజామాబాదు) బొమ్మకంటి సత్యనారాయణ (వరంగల్లు) కె.వి. నర్సింగరావు (కరీంనగరము) కొండపల్లి వెంకటరామారావు (నల్గొండ) కృష్ణమాచారి (మెదక్) ఆర్. వెంకటేశ్వరరావు (మెదక్) గారలుగాక, ముగ్గురు కార్యదర్శులు శ్రీయుతులు వేములపల్లి భాస్కరరావు, హయగ్రీవాచారి, పాగా పుల్లారెడ్డి గారలు హాజరయిరి. వీరుగాక ప్రత్యేకాహ్వానములపై వచ్చినవారు శ్రీ యస్. కె. రావు, శ్రీ కోదాటి నారాయణరావు, డా॥ చెన్నారెడ్డి, కరీంనగరం జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ రఘునాథరావు కాని, మెదక్ జిల్లా అధ్యక్షులు శ్రీ జయరామారెడ్డి, ఆదిలాబాదుజిల్లా అధ్యక్షులు శ్రీ రామచంద్రరావు పైకాజీ, శ్రీ భండారు చంద్రమౌళీశ్వరరావు (వరంగల్లు), శ్రీ బేతి కేశవరెడ్డి (వరంగల్లు), శ్రీ వరకాంతం గోపాలరెడ్డి (అత్రాఫ్ బల్దా), శ్రీ శ్రీనివాసులురెడ్డి, (అత్రాఫ్ బల్దా) పండిత నరేంద్రజీ (ఆంధ్ర "బి" అధ్యక్షులు), శ్రీ కాళోజీ నారాయణరావు.

### అత్యాచార విచారణ సంఘము

ముందుగా, ప్రజాసేవ పేరుతో అత్యాచారములను గావించిన కాంగ్రెసువారిపై విచారణ జరుపుటకై ఏర్పాటు చేయబడిన ఉపసంఘపు కార్యక్రమముపై చర్చ జరిగెను. ఈసంఘములో కాళోజీ నారాయణరావు, నరేంద్రజీ, ఊటూరి నారాయణరావుగారలు సభ్యులు. క్రొత్తగా ఆంధ్ర "బి" అధ్యక్షుడుగా ఎన్నుకొనబడిన నరేంద్రజీ, ఈ ఉపసంఘమునుండి రాజీనామా నిచ్చిరి. క్రొత్తవారిని వారిస్థానే త్వరలో వేయుదురు. ఈ ఉపసంఘ నియామకమే కొందరు కాంగ్రెసు పెద్దలకు రుచింపలేదని, బహుశా ఈ సంఘము పనిచేయక పోవచ్చునని తెలియుచున్నది.

తరువాత కార్యవర్గమువారు శ్రీమతి సరోజినీదేవి మరణమునకు సంతాపమును వెల్లడించుచూ, ఆమె భర్త మేజర్ నాయుడుకు తమ సానుభూతిని తెలియజేయుచూ తీర్మానించిరి.

### కాంగ్రెసు సంఘములు

తర్వాత కాంగ్రెసు సంఘములు లేని తాలూకాలలో, పట్టణములలో, తాత్కాలిక సంఘముల నేర్పాటుచేయుటకు, జిల్లాకు ఇద్దరు చొప్పున కార్యవర్గసభ్యులు ఈ క్రింది విధముగా నియమింపబడిరి:- మెదక్, వరంగల్ జిల్లాలకు బూర్గుల రామకృష్ణరావు, పాగా పుల్లారెడ్డి, నల్గొండజిల్లాకు

(10-వ పేజీ చూడుడు)

[Photo] ఇల్లెందుల రామచంద్రరావు గారు

[Photo] టాంక్ బండ్—హుసేన్‌సాగర్ కు ఒక గట్టు—హైదరాబాదు సికింద్రాబాదులను కలుపు చక్కటి బాట—ఇరుప్రక్కల చెట్లు, చీడీ గుల్లు.

## సర్వమానవ సహకార ప్రజాస్వామ్య స్థాపనే "నవ కాంగ్రెస్" లక్ష్యం

రాష్ట్రపతి కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడు, ప్రధాన కార్యదర్శి అయిన శంకరరావు దేవ్ గారి గ్రంథానికి పీఠిక

నూత్న నిబంధన ప్రణాళికలో కాంగ్రెసుసంస్థయొక్క లక్ష్యము ప్రస్తుత పరిస్థితుల కనువుగా మార్చబడినది. కనుక 'శాంతియుత, చట్టబద్ధమగు పద్ధతులపై స్వరాజ్యమును స్థాపింపవలె' నను ప్రశ్న ఇకరాదు. భారతీయుల క్షేమాభివృద్ధులకై కృషి సలుపవలెనని, శాంతియుత, చట్టబద్ధ మార్గములలో అందరికీ సమానావకాశములు రాజకీయ, ఆర్థిక, సాంఘిక హక్కులు ఇచ్చేటి సహకార ప్రజాస్వామ్యమును నెలకొల్పవలెనని, దాని విశ్వమును ప్రపంచశాంతిగా ఉండవలెనని నూత్న ప్రణాళికలో నిర్వచింప బడినది."

శంకరరావు దేవ్ వ్రాసిన "నవ కాంగ్రెస్" అను గ్రంథమునకు డా॥ పట్టాభి పీఠిక వ్రాయుచు పైవిధంగా వ్రాసిరి.

60 పేజీలు గల ఈ గ్రంథం ఏ. ఐ. సి. సి. విదేశాంగ కార్యదర్శి డా॥ రాజకుమార్ సంపాదకత్వం క్రింద ఏ. ఐ. సి. సి. చే ప్రచురింపబడెను. ఇందులో కాంగ్రెస్ భవిష్యత్ కార్యక్రమం, ఇండియాలో సహకార ప్రజా స్వామ్యము, కాంగ్రెస్ నూత్న ఆదర్శము, కార్యక్రమము, కాంగ్రెసు, దాని సభ్యుల్లో, నవకాంగ్రెసును ప్రజాసంస్థగా చేయండి, అనే 6 అధ్యాయాలున్నవి.

డా॥ పట్టాభి తమ పీఠికలో ఇంకా ఇట్లు వ్రాసిరి.

"ఇండియాలోని ప్రతి వయోజనుడు కాంగ్రెసు సభ్యుడేనని మహాత్మాగాంధీ నిర్వచించెను. 4 అణాల చందా పద్ధతి ...

... చున్న ఈ విప్లవాత్మక భావన ఆయన అనుచరులకొక ఆఘాతమునొసంగినది. దానినుండి తేరుకొని భావనపై నవ కాంగ్రెసును నిర్మింప నెంచిరి. కాని అట్లు చేయుటకు అనేక కష్టములు కలిగినవి. పాతరీతి చందాలు తీసివేయుట అసంభవమని వారు భావింప జొచ్చిరి. కాని మహాత్ముడు తన పట్టును వదలలేదు. ఆయన అంతిమ ప్రణాళికలో కూడ కాంగ్రెసు ... సేవక సంఘముగా ... కాని ఆ ప్రణాళికను అమలు చేయుటకు కావలసిన ధైర్యస్థైర్యములు, త్యాగము పరిణామము ... దేశమునకు అనేకులుగా జానియుండలి అంతేకాక ఆ ఆలోచనలను మార్చి ప్రేరేపించగల బుద్ధిబలము ఆయన కొక్కనికే గలదు. కాని ఆయన ఆకాలమరణము ఈ అవకాశమును నష్టపేసినది. కనుక మనకు మిగిలిన ఆయన అనుచరులు ప్రాత పద్ధతులనే అనుసరించుచు, మహాత్ముని ... తీవ్ర విమర్శకు గురి కావలసి వచ్చినది. మహాత్ముడే ... ఆయన సంకుచిత రాజకీయ, ... సమన్వయ పరచగలిగినాడు. ఆయన జీవితమును భిన్న భాగములుగా ఎప్పుడూ భావించలేదు. జీవితమంతయు ఏకము, అభాజ్యము, నైతిక, ... రాజకీయ, ఆర్థిక సమాస్య సమన్వితము."

[Photo] హుసేన్‌సాగరు ... పరిసరాలు



బోదన్ (నిజాంబాద్ జిల్లా) దగ్గర, చెరుకుపంట

# ఆంధ్ర ఉద్యోగులకు అన్యాయం

9 వ పేజి తరువాయి

కేశవరావు, కె. వెంకటరామారావు, అత్రాఫ్‌బల్దా జిల్లాకు, కొండా వెంకట రంగారెడ్డి, హయగ్రీవాచారి, కరీంనగరం జిల్లాకు కె. వి. నరసింగరావు, వెంకట రంగారెడ్డి, మహబూబునగరము జిల్లాకు బొమ్మకంటి సత్యనారాయణ, వేములపల్లి భాస్కరరావు, నిజామాబాదు జిల్లాకు భాస్కరరావు, కృష్ణమాచారి ఆదిలాబాదు జిల్లాకు కేశవరావు, వెంకటరంగారెడ్డి.

### ప్రాథమికసభ్యులను చేర్చుకాలము

అపైన ప్రాథమిక సభ్యులను చేర్చు కాలపరిమితిని మే నెలాఖరువరకు పొడిగింపవలసినదిగా కేంద్ర కాంగ్రెసు సంఘమును కోరుతూ తీర్మానించిరి.

### పాయిగాలు జాగీర్లు, వ్యవసాయస్థితి

సంస్థానములు, జాగీర్లు, పాయిగాలు మొదలైన ప్రదేశములలోని స్థితిగతులను విచారించి, ఒక నివేదికను తయారుచేసి ప్రభుత్వమునకు సూచనలు చేయుటకై వెంకటరంగారెడ్డి, బొమ్మకంటి సత్యనారాయణ, పల్లెర్ల హనుమంతరావు, పుల్లారెడ్డి, ఉమ్మెత్తల కేశవరావుగార్లతో ఒక ఉపసంఘము నియమింపబడెను. వ్యవసాయ స్థితిగతులను విచారించి, నివేదికను తయారుచేయు నొక సంఘమును నియమింప శ్రీ జమలాపురం కేశవరావునకు అధికార మివ్వబడెను.

సేవాదళనిర్మాణమునకై ఒక ఉపసంఘమును నియమించి, త్వరలో ఆంధ్ర కాంగ్రెసు సేవాదళమును నియమించుటకై కూడా తీర్మానింపబడెను.

సోమవారం ఉదయము శ్రీ బూర్గుల రామకృష్ణరావు తమ గృహములో, శ్రీ అయ్యదేవర కాళేశ్వరంపు గారలవార్థమై ఒక అల్పాహారవిందు నేర్పాటు చేసిరి. కాంగ్రెసు పెద్దలందరునూ విందునకు వచ్చిరి. శ్రీ కాళేశ్వరరావు దాదాపు గంటన్నరసేపు అతిథులతో చెన్నరాష్ట్ర రాజకీయములను గురించి, హైదరాబాదును గురించి, ఇష్టాగోష్టి జరిపిరి. త్వరలోనే ఆంధ్ర రాష్ట్రము ఏర్పడ గలదనీ, కాని ఆర్థిక వ్యవహారములు, సరిహద్దుల సమస్యలు తేలుకరకు తమిళులతో విడిపడుట మంచిది కాదనీ కాళేశ్వరరావు గారనిరి. అయితే, ఇప్పటి కిప్పుడే ఆంధ్రులు విడిపడి నప్పటికి కూడ పెద్ద ప్రమాద ముండదనిరి. శాసనము-శాసన సభ్యులను విభజించి, తెలుగు నాటికి శ్రీమతి అమ్మన్న రాజానే స్పీకర్ గా చేసినచో తీరిపోవును. ఆంధ్ర రాష్ట్రమునకు అమరావతి ముఖ్యపట్టణముగా నుండుట సమంజసము. కాని తెలంగాణావారుకూడా నిడిపడి ముందుకు వచ్చినచో హైదరాబాదును ముఖ్య నగరముగా చేయుట మంచిదనుచు, శ్రీ కాళేశ్వరరావు గారు తా మిట్లంటిమని హైదరాబాదువారు, అవసరము వచ్చినప్పుడు చెప్పుకొన వచ్చుననిరి.

బూర్గుల రామకృష్ణరావు, జమలాపురం కేశవరావు, పాగాపుల్లారెడ్డి, వేములపల్లి భాస్కరరావు, హయగ్రీవాచారి, కొండా వెంకటరంగా రెడ్డి మందుముల నరసింగరావు మొదలైన పెద్ద లందరునూ అనేక ప్రశ్నలువేసి కాళేశ్వరరావుగారి సమాధానములను శ్రద్ధతో వినిరి.

కాళేశ్వరరావు, యం. ఆ. వి. రెడ్డి, కొల్లూరెడ్డి సూర్యనారాయణ గారలు మంగళవారం సాయంకాలం బెజవాడకు విమానములో వెళ్ళిరి.

హైదరాబాదు రేడియోలో తెలుగు కార్యక్రమ కాల పరిమితిని, హిందుస్తాని కార్యక్రమ కాలముతో మే ఒకటవ తేదీ నుండి దాదాపు సమానము చేయబోవుచున్నారని విశ్వసనీయముగా తెలిసినది. ఇంతవరకును పది గంటల కార్యక్రమములలో, 2½ గంటలు మాత్రమే తెలుగున ప్రత్యేకింపబడినది. కాని ఇకనుండి తెలుగు కార్యక్రమ కాలము ఇంకా ఒకటిన్నర గంటలు పెరుగవచ్చును. ఈ క్రొత్తమార్పుల సందర్భములో, అదనపు సిబ్బందిని కూడా నియమించుట జరుగునని తెలియుచున్నది.

మే-ఒకటి నుండి ఔరంగాబాదు రేడియోలో మరాటీ కార్యక్రమ కాలము పెంపు స్తాపే కాలమునకు పెంపు చేయబడును.

# హిమగిరి యాత్రానుభవాలు

8 వ పేజి తరువాయి

యీ జట్టులోనుండిరి. ఇండియను మీటిరియాలజికలువారు, సెంట్రలు వాటరు పవరు ఇరిగేషను నావిగేషను కమిషను వారు యీయాత్ర తలపెట్టిరి. సర్. ఎస్. ఎస్. భట్నాగరు, ప్రొఫెసరు హెచ్. జె. భాభా, సర్. జె. సి. గోషు, డా॥ జె. ఎస్. ముఖర్జీ, ప్రొఫెసరు ఎం. ఎన్. సాహా, సర్. ఎ. ఎన్. ఖోస్లవంటి ప్రముఖ శాస్త్రజ్ఞుల సలహా సహాయమును వారు ముందుగానే బడసిరి.

### శిఫార్సులు

ఒట్టువారు పరిశీలించిన కొండ శిఖరాలలో కేసికనము చేయదగిన స్థలం యించుక అనుకూలంగానుంది. పంగర్చుల శిఖరం, చుట్టు అడ్డంకులులేక 15000 అ. ఎత్తున్నది. దానికి కేరిలో యకు మస్యదు 14000 అ. ఎత్తున వేరొక అనుకూల స్థలం గలదు. ఇంకా దిగువను 12458 అ. ఎత్తున జాపిమతునకు రోడ్డుతో సులభంగా కలుపదగ్గ గోర్సవాను శిఖరము వేరొకటిగలదు. ఇంకా 500 అడుగుల దిగువను "అవుల్చు గ్యాల్" అను వేరొక మైదానము, శాస్త్రజ్ఞుల వలసకు తగియున్నది.

కొండశిఖరాలు వలసాకారంగా నియమించుట అసాధ్యమనియు, పరిశోధనాలయము శాస్త్రజ్ఞుల వలస ఒకే శిఖరాన ఉండుట మంచిదనియు, నిరుటి బట్టువారు శిఫార్సు చేసిరి. అట్లయిన రోడ్లు రైళ్లు నిర్మించుటకుగాని, నీటి సప్లయికి కాని కష్టముండదు. పరిశోధన కార్యాలయం స్థాపనకు స్థలం నిర్ణయించినానక, విమానాశ్రయంగూర్చి ఆలోచించుటలో వచ్చుని విడచిపెట్టిరి.

నిరటి యాత్రికులకు తినుబండారములు సామానులు కొండశిఖరాలకు మోసుకపోవుట చాలాకష్టమయినది. సుమారు 40 మంది కూలీలు, 9 కంచరగాడిదలను ఉపయోగించిరి. అవి మొత్తం 60 మణుగుల ధాన్యాలు పప్పులనుండి పిన్నులు టించరైడుమువరకు అనేకరకాల అవసరమయిన వస్తువులను, మోసినవి. మోటారు విడచి నాక కాలినడకను అతిదూరం పోయి వచ్చినా యీ శాస్త్రజ్ఞులంతా ఇండ్లకు మరలేసరికి విడచినప్పటికన్నా ఎక్కువ ఆరోగ్యంగానే యుండిరి.

# గ్రంథ పరిచయం

### భారతీయ తత్త్వశాస్త్రం

భారతీయ తత్త్వశాస్త్రము. (షడ్దర్శనములు : వేదాంత సూత్రభాష్య సంప్రదాయములు) ప్రథమభాగము, రచయిత : శ్రీ నిర్వికల్పానందస్వామిగారు. ప్రకాశకులు : సాధనమండలి తెనాలి. పేజీలు 147. వెల రూ 2-0-0.

దర్శనములు భారతీయ విజ్ఞానమునకును, ఆధ్యాత్మికసంపత్తికిని,ఆలవాలములు పరమపురుషార్థసిద్ధికి మార్గములు చూపు ఈదర్శనములకు ఆంధ్రదేశంలో ప్రచారముతక్కువగా నున్నది. ఈ శాస్త్రములకు సంబంధించిన తెలుగు గ్రంథములు బహువిరళము గా నున్నవి. ఇప్పుడు సమీక్షకై మాకార్యాలయము చేరినగ్రంథము ఈ కొరతనుకొంత వరకు తీర్చి ఈ దర్శనముల సిద్ధాంతములను ఆంధ్రులకు కరతలామలకము గావించునదై యున్నది.

వేదాంతులకు సుపరిచితులేయైన శ్రీనిర్వికల్పానందస్వామిగారు ఈ గ్రంథములో న్యాయవైశేషిక, సాంఖ్యయోగ పూర్వమీమాంసాశాస్త్రముల సిద్ధాంతములను గూర్చియు, వేదాంతుల వివిధ మతభేదములనుగూర్చియు అసామాన్యమగు ప్రజ్ఞతో, కూలంకషమగు శాస్త్రపరిజ్ఞానముతో, తేట తెలుగు భాషలో, హృద్యముగా వివరించియున్నారు.

శ్రీ శంకరుల అద్వైతవాదము, శ్రీ రామానుజుల విశిష్టాద్వైతవాదము, శ్రీ శంతశివాచార్యుల శివాద్వైతవాదము, వల్లభుని శుద్ధాద్వైతవాదము, నింబార్కుని ద్వైతాద్వైతవాదము, శ్రీ చైతన్యుని అచింత్యభేదాభేదవాదము, విజ్ఞానభిక్షుని సమన్వయ వాదములనుగూర్చి వీరు వివరించియున్నారు.

ఈ వివిధ మతముల సిద్ధాంతములను గ్రంథకర్త యథాతథముగ ప్రవచించి వానిలో నొండొంటికిగల తారతమ్యములను చూపుచున్నారు. ఈ దర్శనకారుల కాలము, వారి జీవితచరిత్ర, వారి సంప్రదాయములకు సంబంధించిన వాఙ్మయము గూర్చి సంగ్రహముగా తెలుపుచున్నారు. వేదాంతశాస్త్రమునకు అధికారియెవ్వరు? వేదాంతశాస్త్ర విషయమెయ్యది? ఈ శాస్త్ర ప్రయోజనమేమి? ప్రతిపాద్య ప్రతిపాదక విషయములకు సంబంధమేమి? అను విషయములపై వివిధ మతాచార్యులు వెలిబుచ్చిన భావములను, బ్రహ్మము, జీవుడు ప్రపంచ స్వరూపముల విషయమై వారి భావములను వీరు తెలుపుచున్నారు.

శాంకరమతముపైయుండు గ్రంథకర్తకుగల అభిమానము సర్వత్ర గోచరించుచునే యున్నది. శంకరులు జ్ఞానులలో శ్రేష్ఠుడై, నేటికి గూడ సమస్త జగత్తునందలి విజ్ఞుల యభినానల బొందుచున్నారు. వివేకానందుని భవిష్యద్వాణి ననుసరించి సైన్సు, అద్వైతవాదములు చేతులు గలుపుకొనుచున్నవి. శంకరును చూపెనంతగా రామానుజుల ప్రతివాక్యములు మాప లేకస్వృతులనే బహుళముగా వ్రాసియున్నాడు. గ్రహించిన ప్రతివాక్యములు పెక్కులు అప్రసిద్ధములు ఉపనిషత్తులకు చెందినవి శంకరుని విశాలదృష్టి రామానుజునియందుగాని, తదితర వైష్ణవాచార్యులయందు గాని కన్పించదు, అని వ్రాసియున్నారు. ఐనప్పటికి రామకృష్ణ మతస్థులకు సహజమగు సర్వమత సమత్వము, విశాలదృష్టి సమన్వయభావము వీరు ప్రదర్శించుచున్నారు. 'శ్రీ రామానుజుడు భక్తశ్రేష్ఠుడై, భావుక చూడామణియై, భారతదేశమునందలి జనసామాన్యముయొక్క హృదయమున శాశ్వతముగా అభిషిక్తుడై వెలయుచున్నాడు. వైదికమార్గముల యందు మందమందముగ నిక్షిప్తమైన భక్తితంత్రములు ఆళ్వారుల తీవ్ర సాధనచే ప్రతిస్పందితములై శ్రీ రామానుల, మధ్వ, వల్లభ, నింబార్కులచే మీటబడి, గౌడీయ వైష్ణవదర్శనము మధురవాణిగ రూపొందినది. ఆళ్వారుల యొక్కయు శ్రీ రామానుజుల యొక్కయు ఆశాస్వప్నములు శ్రీ చైతన్యదేవునియందు సఫలీకృతములై ఆసేతు హిమాచలము భక్తి తరంగములను లేవదీసినవి.' అని నుడువుచున్నారు.

షడ్దర్శనములకు సంబంధించిన వాఙ్మయమునంతటిని అవలోడన గావించి, తాము సేకరించిన విషయజాలమును ఈ గ్రంథములో పండిత పామరరంజకముగా ఆంధ్రులకు సమర్పించినందులకు స్వామిజీ ఎంతయూ అభినందనీయులు. ఇది వరలో మా భారతి యందు ప్రకటితమైన ఈ వ్యాసములను యిప్పుడు ఒక సంపుటముగా ప్రచురించి తెనాలి సాధనమండలి వారు ఆంధ్రులకు మహోపకారమొనర్చియున్నారు. భక్తి జ్ఞాన వైరాగ్య బోధకములగు అనేక గ్రంథములను వెలయించుచున్న ఈ గ్రంథమండలి అందరి అభిమానమునకు పాత్రముకాదగును. మనోహరమగు ఈ గ్రంథమును అందరు చదివి దర్శనశాస్త్ర రహస్యములను తెలిసికొందురని ఆశించుచున్నాము.

### జమీన్ రైతు — ఉగాది సంచిక

సస్యశ్యామలమైన పంట పొలంలో, భారతదేశపు వెన్నెముకయైన రైతు జీవితాన్ని, వ్యవసాయలక్ష్మిని స్ఫురింపజేసే చక్కని త్రివర్ణచిత్రంతో ఈ సంచిక చూడ ముచ్చటగావున్నది. లోపల వివిధ విషయాలనుగురించి కొన్ని మంచివ్యాసాలుకూడవున్నవి. అందులో విద్యావేత్త గాంధీజీనిగురించి రంగాగారున్నూ భారతదేశంలో జమీందారీల రద్దు కృషినిగురించి కరా వెంకటరావుగారున్నూ, నవభారతంలో స్త్రీలనుగురించి పొణకా కనకమ్మ ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ గార్లున్నూ వ్రాసిన వ్యాసాలు ముఖ్యంగా పేర్కొనదగివున్నవి. శ్రీ నెహ్రూ, పటేల్, పట్టాభి, రంగా మొదలైన మన నాయకుల చిత్రాలూ, హంపిమహానంది క్షేత్ర దృశ్యాలూ, చంద్రశేఖరంగారి వివిధ వేషధారణ భంగిమలూ సంచికకు మరికొంత అందాన్ని ఇస్తున్నవి. డెమ్మీ క్వార్టో సైజుగల 112 పుటల గ్రంథ మిది.

సంపాదకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడుగారు కార్యస్థానం : నెల్లూరు, వెల 8 అణాలు.

ఆంధ్రజ్యోతి:—వెల రూపాయి దొరకు చోటు 37, ఆచారప్పన్ వీధి. జి టి మదరాసు ఇందులో నార్ల కుటుంబరావు, మల్లాది రామకృష్ణశాస్త్రి, చలం రచనలున్నాయి

# సత్రంలో సంసారాలు

7 వ పేజి తరువాయి

తన ఆదర్శం ప్రతివ్యక్తికీ బోధించాలనీ, ప్రతి నిముషం ప్రయత్నం చేయటంలో 'జెనూట్లు'ను మించి పోయింది, యీమె.

గదిలోకి వెళ్లుచున్నాను. అతి మధురంగా పాడుతున్నది. "ఆబాలిక ఎలాపాడుతున్నదో విను, అంటున్నాడు నా అతిథి.

"ఆమెకు ముప్ఫయి యేళ్లు," అన్నాను.

ఆశ్చర్యపోయి, "దైవసంకీర్తనకు గాబట్టి దేవుళ్చాడు ఆగొంతు," అన్నాడు అతిథి. మధురంగా, "జలధిశయనే వనమాలీ" అన్నప్పుడు సత్రం అంతా కదిలివచ్చి ఆగానం వింటున్నారనటో నక్కరలేదు. ఏ యిద్దరు ముగ్గురో తప్ప తక్కినవారు ముందు సంగతీ, అభిషేకాలకు సత్రి సంగతీ, పప్పులో వుప్పు సంగతి యథాలాపం సాగిస్తూనే వున్నారు.

మర్నాడు ప్రొద్దున ప్రక్కన వున్న కాలేజి విద్యార్థుల గదిలోకి వెళ్లాను, మా బావమరది అందులో వుంటే. నేను గడపలో అడుగు పెట్టేటప్పటికి "పట్టి వేడికాదం"టున్నాడు మావాడు. నన్ను జూసీ ఆ విషయంమాట్లాడ్డంత పేశాడు. ఆ గదిలో పది నిమిషాలు కూర్చొనియున్నా. రెండో కుర్రాడి ముఖంలో బాధ విస్పష్టంగా కనపడుతున్నది.

నన్ను పంపించటానికి బయటికి వచ్చి "యీవూళ్లో మంచి డాక్టరు ఎవరు బావా? అన్నాడు.

"ఎందు"కన్నాను.

"పనుంది"

"చెప్పరాదూ"

"మారాం మేట్ను మాశావుగా"

"జ్వరమా ? "

"దానికి మంచి డాక్టరు ఎందుకూ? "

"ఎవరా మహాతల్లి "

"మీ సత్రంలో......"

"బావా అనూహ్యమయిన విషయం విన్నాం, అనుకొన్నాను.

"ఏంటలా చూస్తావు," అన్నాడు.

"ఆవ్యక్తి నిచ్చగించే వ్యక్తి ఒక్కడయినా వుంటాడని నేనూహించలా"

"నీవేమనకుండా వుంటే ఒక్కమాట చెప్తాను. మీ సత్రంలో ఈ వ్యక్తివిషయములోదెబ్బతగిలి డాక్టరు ముదుపుచెల్లించుకోని మగవాడులేడు."

"నన్ను గూడా కలిపావా ? "

నవ్వాడు.

"ఎవరెవరు"

"ఆకోర్టు సుమాస్తా, మునిసిపాలిటీకి ప్రచారం చేయడానికి వచ్చిన కుర్రాడూ, యీ చుట్టుప్రక్కల వున్న కాలేజి కుర్రాళ్ళూ, ఒకరేమిటి ? "

ఇందులో భార్యలున్న వాళ్ళూ వున్నారు, పెళ్లి కాని వాళ్ళూ వున్నారు; చదువుకున్న వాళ్ళూ వున్నారు; చదువుకోనివాళ్లుమాత్రం లేరు.

మళ్లా ఆర్నెల్లకు సత్రానికి వచ్చాను. నాటకంలో అంకమయినా కొన్నవ్యక్తులు మారి, పాతక్రొత్తకలయికలో పాతవాళ్ళు కొంతమందీ, క్రొత్తవాళ్లు కొంతమందీ వచ్చినట్లు, చాలా క్రొత్తవాళ్లు వచ్చారు.

మోకాలిక్రింద పుండుతో ప్రబలకపని ఆరుగు మూల్గు మూలిగిన వ్యక్తి ఆ సత్రంలో జవాను. ఆ రోజుల్లో వాణ్ణి చాలా ఏవగించుకున్నాము. గేటు అటూ యిటూ దాటేవా ళ్లందరిలో చూశాను ఆ ఏవగింపు.

ఇప్పుడుకు గేటు జవాన్. అందరూ పిలుస్తారు. నీళ్ళు పోయించుకుంటారు. కొందరు అతను పోసినవే త్రాగుతారు. తోచనప్పుడు కూర్చోబెట్టి కబుర్లు చెప్తారు.

లోకంలో విలువలు మారుతుంటాయి. పూర్వపు స్త్రీకోసం కలయు జూశా. కనపడలేదు. స్త్రీలు లేకుండా లోకం నడుస్తుందా? సత్రం లోకంలో ఒక భాగం మాత్రమేగా ?

### శ్రీ ప్రసన్నానందగురు

మద్రాసు, ఏప్రిల్ 15: శ్రీ యోగీ ప్రసన్నానందగురు 1904వ సం॥ములో కేరళదేశములో జననము. ఇరువదేండ్ల చిన్నతనముననే విద్యముగించి, హిందూసనోద్ధరణకును దరిద్రోద్ధరణకును పూనుకొని సన్యాసమును స్వీకరించి హిమాలయాది పర్వతములమీద అనేకతపస్సులు కావించిన మహాయోగి. రాబోవు అక్టోబరుమాసంలో 3వ తేదీ మొదలు 125 రోజులు జరుపు దర్గపూజనిమిత్తము ప్రస్తుతము వీరు తమ ప్రసన్నాశ్రమంను —బ్రిడ్జిరోడ్, తిరుపూర్ (యస్. ఐ. ఆర్)—నున్నారు. శిష్యులు సేవకులు మద్రాసురాజధానిలోను కలకత్తాలోను కలరు. జాతిమతవిచక్షణలులేక ఎందరో అనారోగ్యులను రోగములను కుదుర్చుచున్నారు.





















Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, No 7, Thambu Chetty St, G T Madras